# అభిప్రాయవేదిక

"పత్రికను ఉత్తమ సాంప్రదాయాలతో వెలువరిస్తున్నందుకు అభినందనలు."

– జానమద్ది హనుమచ్ఛాస్త్రి, కడప

"శ్రీవాణిని చూచిన తరువాత మిమ్మలను అభినందించకుండా వుండలేకపోతున్నాను. పత్రిక నిండుగా వుంది. రంజనిమాల "హైలైట్".

– డా॥ ఇ. చంద్రమౌళి, తిరుపతి

"సాహిత్యంలో ఆరోగ్యవంతమైన సత్ సాంప్రదాయాల్ని పాటిస్తూ, వ్యయ ప్రయాసలకోర్చి శ్రీవాణిని తీర్చిదిద్దుతున్నందుకు అభినందనలు."

– డా॥ డి. శ్రీనివాసబాబు, హైద్రాబాద్

"పత్రిక స్థిరపడినందుకు, కొన్ని విలువల్ని పాటిస్తున్నందుకు సంతోషంగా వుంది."

– డా॥ తంగిరాల, బెంగుళూరు

## జులై రంజనిమాల సమాధానములు

### అడ్డము

1. అడియాస కొలువు గొలువకు, 5. లధిక బాధ, 7. రత్నము, 9. నిర్వాహము, 10. పుత్రుడు, 13. కుదువబెట్ట, 14. గప్పలు, 15. కనకపు, 17. కరణము గరణము నమ్మిన, 20. తన శాంతమె తనకు, 21. మిడుకుట.

### నిలువు

1. అధరము గదలియు గదలక, 2. కొఱగాని కొడుకు పుట్టి, 3. కులగాంత తోడు నెప్పుడు, 4. ఒక యూరికి నొక కరణము, 6, దన భాగ్యమె తనకు గాక తథ్యము, 8. పాముల, 10. పులిపాలు, 11. గావలె, 12. నట్టువులకైన వచ్చు, 16. తన కలిమి, 18. రణమున, 19. నెప్పకు.

## శ్రద్ధాంజలి



జననం : 7-8-1919 మరణం : 22-7-1986

"శ్రీవాణి" మాసపత్రిక పోషకులు, ప్రముఖ సాహిత్య, సాంస్కృతిక, విద్యా సేవాపరాయణులు, సహృదయులు, ఆత్మీయులు అయిన

**శ్రీ మునునూరి జగన్నాథరావుగారు**

పరమపదించారని తెలుపుటకు విచారిస్తున్నాను. వారికి నా శ్రద్ధాంజలి. వారి ఆత్మకు ఆ దైవం సదా శాంతిని చేకూర్చాలని ప్రార్థిస్తున్నాను. వారి కుటుంబానికి నా సానుభూతిని ప్రకటిస్తున్నాను. – సం.

## సవరణ

శ్రీవాణి జీవితసభ్యులు
శ్రీమతి వేపా పార్వతీదేవి
పేరు బదులు పొరపాటున శ్రీమతి వేపా సరస్వతీదేవి అని జూలై సంచికలో పడింది. మన్నించ ప్రార్థన

(సం)

అగస్టు - 1986

సంపుటి : 2

సంచిక : 8


# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక


సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818


చందా వివరాలు

విడిప్రతి : రు. 3-00

సంవత్సర చందా : రు. 33-00

జీవిత సభ్యత్వం : రు. 500-00


EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM


## విషయసూచిక

# రిజర్వేషన్ల రగడ ఇంకెంతకాలం?

'రిజర్వేషన్ల రగడ' అని గత ఆగష్టు 1985 'శ్రీవాణి' లో సంపాదకీయం వ్రాయడం జరిగింది మరల సరీగా ఒక సంవత్సరం తరువాత అదే విషయాన్ని గురించి వ్రాయవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను. "ఇకమీదట ఆర్థిక దారిద్ర్యాన్ని మాత్రమే వెనుకబాటు తనానికి, తద్వారా రిజర్వేషన్లకు ప్రాతిపదిక చేసుకొని అన్ని కులాలవారికి వర్తింపజేయాలి" అని అభిప్రాయ బడిన 'రాణే కమీషన్' రెండవ ప్రతిపాదనను తిరస్కరించి, మొదటి ప్రతిపాదనను మాత్రమే స్వీకరించి సోలంకి (గుజరాత్) ప్రభుత్వం ఎన్నికలలో గట్టెక్కడం కోసం రిజర్వేషన్లను ఒకే పర్యాయం బాగా పెంచివేసింది. అర్జున్‌సింగ్ (మధ్యప్రదేశ్) ప్రభుత్వం ఒక్క పెట్టు 25 శాతం పెంచి, 78 శాతం ఉద్యోగాలను, కాలేజీ సీటను రిజర్వ్ కోటా క్రిందకు ఆనాడు తేవడం వలన గగ్గోలు పుట్టింది. ఉద్యమాలు జరిగాయి. కోట్లాది రూపాయిల ఆస్తులు ధ్వంసమైనాయి. కొన్ని వందల నిండు ప్రాణాలు బలైనాయి.

రానున్న మండల ఎన్నికలలో అధికారాన్ని సంపాదించాలనే తాపత్రయంతో తెలుగుదేశం ప్రభుత్వం హడావిడిగా, మిత్ర పక్షములవారిని కూడా సంప్రదించకుండా రిజర్వేషన్ల కోటాను పెంచివేసింది. మురళీధరరావు కమీషన్ అభిప్రాయాలను అమలుపరుస్తున్నామని ప్రభుత్వం పేర్కొన్నది. వీరి వాదనలో ఏ మాత్రం చిత్తశుద్ధి కనుపించడంలేదు. ఆ నివేదికను నాలుగు సంవత్సరాలపాటు నానబెట్టి, చిట్టచివరికి ఆయన మరణించిన తరువాత, ఈనాడు ఆ రిపోర్టు వీరి దృష్టికి వచ్చిందంటే ఏ విధంగా నమ్మాలి? తిరుపతిలో ఆనాడు జరుగుతున్న వెనుకబడిన తరగతుల సమావేశాన్ని భగ్నం చేయడానికే తెలుగుదేశం ప్రభుత్వం అంత తొందరపడడానికి ప్రధాన కారణం.

అనాలోచితమైన, అచరణ సాధ్యం కానటువంటి ఈ ప్రభుత్వ చర్యను మేధావి వర్గం, విద్యార్థులు ప్రముఖంగా తిరస్కరించారు. ఉద్యమం ఉధృత రూపం దాల్చింది. అగ్రకులాల వారిలో, మెరిట్ విద్యార్థులలో ప్రభుత్వం యెడల తీవ్రమైన అసంతృప్తి చెలరేగింది. వెనుకబడిన తరగతులవారికి కూడా, సీలింగ్ పెట్టడం వలన అసంతృప్తి కలిగింది. దీనికి కారణం ఏమిటి? పూర్వాపరాలను ఆలోచించకుండా, దీనికి సంబంధించిన వారితో సంప్రదించకుండా చేసిన అనాలోచితమైన తొందరబాటు ప్రభుత్వ నిర్ణయమే దీనికి కారణం. ఈ నిర్ణయం వలన సఖ్యతగా జీవితాన్ని కొనసాగిస్తున్నవారి మధ్య స్పర్థలు మాత్రం ఏర్పడ్డాయి. మమ్ములను సంప్రదించకుండా ప్రభుత్వం ఏక పక్షంగా నిర్ణయాలు గైకొనినందుకు ప్రతి పక్షాలు మూతి ముడిచాయి. కొన్ని ప్రతి పక్షాలు ఈ చర్యను నిరసిస్తూ కూడా పెంచిన రిజర్వేషన్లు మాకు సమ్మతమేనని ప్రకటించాయి. మరికొన్ని ప్రతి పక్షాలు పెంచిన రిజర్వేషన్లను ఆమోదిస్తూనే మెరిట్ గల వారికి కొంత శాతం సీట్లు కేటాయించాలని డిమాండ్ చేసాయి. మొత్తంమీద అన్ని ప్రతి పక్షాలు పెంచిన రిజర్వేషన్లను ఆమోదిస్తున్నాయి. ఆమోదించకుండా వాస్తవాన్ని బహిర్గతం చేస్తే బడుగువర్గాల ఓట్లు ఎక్కడ పోతాయేనని వీరి భయం అందువలన అన్ని పక్షాలు ప్రభుత్వ చర్యకు మద్దతును ప్రకటించాయి. 20 శాతం సీట్లు మెరిట్ వారికి అదనంగా కేటాయిస్తున్నానని యన్. టి. ఆర్. ప్రకటించారు. ఈలోగా హైకోర్టు ప్రభుత్వ ఉత్తర్వును సస్పెండ్ చేసింది. "అవసరమైతే సుప్రీంకోర్టుకైనా వెళ్ళతాను, ఎటువంటి పరిస్థితులలోను ఈ విషయంలో వెనక్కుపోయేది లేదు" అని యన్. టి. ఆర్. మరల ప్రకటించారు. ఇది ఈనాటి పరిస్థితి.

రిజర్వేషన్ల పుట్టు పూర్వోత్తరాలను పరిశీలిద్దాం. 1950 లో మన రాజ్యాంగం అమలులోనికి వచ్చిన తరువాత 304 అధికరణను అనుసరించి వెనుకబడిన తరగతుల జాబితాను తయారుచేయడానికి ప్రభుత్వం ఒక కమీషన్‌ను నియమించింది. వారు 112 కులాల జాబితాను తయారు చేసారు. వీరికి ఉద్యోగాలలో 25 శాతం కేటాయించారు. 1952 లో ఈ రిజర్వేషన్లు చెల్లవని మద్రాసు హైకోర్టు తీర్పు యిచ్చింది. అక్కడ ఆందోళన కొనసాగడంతో, అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీమాన్ రాజగోపాలాచారి, పండిత నెహ్రూను ఒప్పించి రాజ్యాంగానికి సవరణ చేయించారు. రాజ్యాంగానికి అదే మొదటి సవరణ. మన రాజ్యాంగ వేత్తలు ఈ తారతమ్యాన్ని పది సంవత్సరాలలో భర్తీ చేయవచ్చునని ఆనాడు భావించారు. కాని ఈ గడువును తడవ తడవకు పెంచుతూ వచ్చారు. కాకా కాలేల్కర్ కమీషన్ కులం ప్రాతిపదికా? లేక ఆర్థిక ప్రాతిపదికా? అనే అంశాన్ని పరిశీలించింది. 1961 లో ఈ కమీషన్ తన నివేదికను యిస్తూ, రాష్ట్రాలు

ఏ ప్రాతిపదికనైనా ఎన్నుకోవచ్చునీ, ఆర్థిక ప్రాతిపదిక సమర్థనీయమని చెప్పింది. మండల్ కమీషన్ రిజర్వేషన్లను 50 శాతం వరకు పెంచవచ్చని అభిప్రాయపడింది. ఏ రకమైన రిజర్వేషన్లు అయినా మొత్తం 50 శాతానికి మించరాదని సుప్రీంకోర్టు ఒక తీర్పులో పేర్కొంది. ఆదిలో పది సంవత్సరాలు అనుకొనిన ఈ గడువు 36 సంవత్సరాలు పూర్తి అయినా యింకా కొనసాగుతునే వున్నది. మన రాష్ట్రంలో అన్ని రిజర్వేషన్లు కలిసి ఇప్పుడు మొత్తం 71 శాతానికి చేరుకుంది. ఇంత చేసినా ఈ రిజర్వేషన్ల వలన ఆశించిన ఫలితాలు చేకూరడం లేదు. ఈ కులాలలో ఆర్థికంగా, రాజకీయంగా ముందంజ వేసినటువంటివారే, ఈ రిజర్వేషన్ల ఫలితాలను అనుభవిస్తున్నారు. అట్టడుగున వున్న ప్రజలకు వీటి వలన ప్రయోజనం చేకూరటంలేదని అందరూ అంటూనే వున్నారు. 25 శాతం రిజర్వేషన్లు అమలులో వున్నప్పుడు వెనుకబడిన వర్గాలలో ఎనిమిది శాతానికి మించి ప్రయోజనం పొందలేదని శ్రీ యన్. టి. ఆర్. కూడా అన్నారు. అంతేకాదు మధ్య దళారీల దోపిడీవల్ల వెనుకబడ్డ తరగతుల వారికి ఆశించిన ఫలితం చేకూరలేదని ముఖ్యమంత్రి చెప్పారు సుప్రీంకోర్టు తీర్పునకు భిన్నంగా కొన్ని రాష్ట్రములు 78 శాతందాకా ఈ రిజర్వేషన్లను పెంచడం జరిగింది.

ఇంత ఎత్తున రిజర్వేషన్ల కోటాలను పెంచుతున్నా, గడువులను తడవ తడవకు పెంచుతూ పోతున్నా బడుగు వర్గాల జీవన పరిస్థితులు మెరుగుపడటం లేదనే విషయం మాత్రం యదార్థం. అయితే దీనికి బాధ్యులెవరు ? ఈ అసమర్థతను కప్పిపుచ్చుకోవడానికోసం, యింకా ఈ రిజర్వేషన్లను పెంచుతున్నారా ? ఈ దుస్థితికి తరుణోపాయం లేదా ? ఇంకా ఎంతకాలం అగ్రకులాలవారు, మెరిట్ గలవారు నష్టపోవాలి ? ఒకరి అభ్యున్నతికోసం మరొకరి అభ్యున్నతిని ఎంతకాలం పణంగా పెట్టాలి ? ఇంకెంతకాలం ఈ రిజర్వేషన్లను పెంచుతూ పోతారు ? మన రాష్ట్ర ప్రభుత్వమైతే 2000 సంవత్సరములదాకా అని చెబుతున్నది. అంతకాలం అగ్రకులాలవారు నష్టపోవాల్సిందేనా ? అంతకాలం మెరిట్ కు సమాధి కట్టవలసిందేనా ? అగ్రకులాలలో మాత్రం ఆర్థికంగా వెనుకబడినవారు లేరా ? ఎం. బి. బి. యస్. లో గోల్డు మెడల్ సంపాదించిన ఒక అగ్రకులం విద్యార్థికి, పోస్టు గ్రాడ్యుయేషన్ సీటు లభించదుగాని తపాలవారీగా తక్కువ మార్కులతో ఎం. బి. బి యస్ ప్యాసయిన ఎస్. సి. విద్యార్థికి యం. యస్ లో సీటు లభిస్తున్నది. అంతేకాదు కొంతకాలం ఒక సీనియర్ ఉద్యోగి క్రింద జూనియర్‌గా పనిచేసిన వ్యక్తి ( రిజర్వుడు కులానికి చెందిన ) కి ప్రమోషన్ వచ్చి ఆఫీసర్ అయిపోవచ్చును. సీనియారిటీ వున్నప్పటికీ అతడు అగ్రకులంవాడు కావడం వలన ప్రమోషన్ రాకపోవడం జరుగుతున్నది. ఈ విధానం వలన వైషమ్యాలు పెరుగుతున్నాయి.

అట్టడుగున వున్న దంత వర్గాల ప్రజల సముద్ధరణకు ఎవరికీ ఎట్టి అభ్యంతరంలేదు వారి అభ్యున్నతని కోరవలసినదే. ఆది అందరి విద్యుక్త ధర్మం. "సర్వేజనా సుఖినో భవంతు " గదా ! అయితే తినటానికి కడుపునిండా తిండే లేనివాడు దురదృష్టవశాత్తు అగ్రకులంలో పుడితే వాడి భవిష్యత్తు మృగ్యం కావల్సిందేనా ? స్వాతంత్ర్యం వచ్చి నాలుగు దశాబ్దాలు కావస్తున్నా యింకా అప్లికేషన్ ఫారములలో కులం వ్రాయవలసిన దుర్గతి వైదొలగలేదు గదా ! ఇటువంటి పరిస్థితి కొనసాగినంతకాలం కులాల మధ్య సామరస్యం ఎలా ఏర్పడుతుంది ? మనమంతా ఒకే జాతీయులం అనే అభిప్రాయం ఎలా కలుగుతుంది ? ఈ అడ్డుగోడలు వైదొలిగి 'ఏకాత్మ భావం' పెంపొందాలంటే కుల ప్రాతిపదికపై రిజర్వేషన్ విధానానికి స్వస్తి చెప్పాలి. కేవలం ఆర్థిక ప్రాతిపదికపై రిజర్వేషన్ విధానం రూపొందాలి. అంతేకాదు ప్రస్తుత రిజర్వేషన్ల విధానం వలన ప్రతిభగలవారు కనుమరుగవుతున్నారు. సామాన్య మార్కులతో ప్యాసయినవారు సీట్లు సంపాదించుకుంటున్నారు. అగ్రకులాల వారికి ఉద్యోగాలు ఎలాగూ రావు కనీసం చదువుకోవటానికి కాలేజీ సీట్లు కూడా దొరకకపోతే వారు ఏం కావాలి ? సమగ్ర సమాజాభివృద్ధి జరిగినప్పుడే దేశం ప్రగతిపథంలోనికి పయనిస్తుంది. ఈ వాస్తవాన్ని మాత్రం విస్మరించరాదు.

కనుక ఈ అశాస్త్రీయమైన రిజర్వేషన్ విధానంపై జాతీయస్థాయిలో సమగ్ర చర్చ జరగాలి. ఈ రిజర్వేషన్ల గడువు యింకా ఎటువంటి పరిస్థితులలోను 5 లేక 10 సం. మించి పెంచరాదు. అప్పటివరకు సుప్రీంకోర్టు తీర్పు ప్రకారం రిజర్వేషన్లు మొత్తం 50 శాతానికి మించరాదు. ఆ తరువాత కేవలం ఆర్థిక ప్రాతిపదికపైననే రిజర్వేషన్లు కొనసాగాలి ఈ విధానం ఎంత త్వరితంగా అమలులోనికి వస్తే అంత దేశానికి క్షేమం. కులంతో ప్రసక్తి లేకుండా ఆర్థికంగా వెనుకబడిన వారందరి అభ్యున్నతికి కృషి జరగాలి. అప్పుడే సమ సమాజ స్థాపన జరుగుతుంది.

— ( సం. )

# సంపాదకీయం స్వాతంత్ర్యదినోత్సవ సందేశం

బ్రిటీషువారు మన భారతావనిని విడిచిపెట్టి నాల్గు దశాబ్దములు కావస్తున్నది. వారు సృష్టించి వెళ్ళిన సమస్యలు కోకొల్లలు. వాటి వలన చేకూరిన నష్టమును ఈనాటికీ మనం పూరించుకోలేకపోగ, పరిష్కరించుకోలేక సతమతమవుతున్నాం. బ్రిటీషువారి కుట్రవలన భారతమాత మూడు ముక్కలుగా ఖండించబడింది. సంపూర్ణ స్వాతంత్ర్యం సిద్ధించకపోయినప్పటికీ పాక్షిక స్వాతంత్ర్యం లభించినందుకు ఆనాడు సంతృప్తిపడ్డాం. అంతేకాదు ఈ విభజన తాత్కాలికమేనని ఆనాడు మన నాయకులు చెప్పారు. అయితే అది శాశ్వతమై నిత్యమై, సత్యమై రోజు రోజుకు అనేక సమస్యలను సృష్టిస్తూ భారతదేశ స్వాతంత్ర్యాన్నే సవాలు చేస్తూ నిలిచింది నేడు.

ఆనాడు జరిగిన ఏ. ఐ. సి. సి. లో తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ అబ్దుల్ కలాంఆజాద్ "ఈ విభజన అనేది కేవలం చిత్రపటంమీది విభజన మాత్రమే. ఇది ప్రజా హృదయాల విభజన మాత్రం కాదు. ఈ విభజన అనేది కేవలం కొద్దికాలం మాత్రమే వుంటుందని ( Short Lived Partition ) నేను గట్టిగా నమ్ముతున్నాను." అని అన్నారు. శ్రీ టాండన్ నిర్మొహమాటంగా విభజననే వ్యతిరేకించారు. "పునరైక్యత జరిగేవరకు నిద్రపోరాదు" అని శ్రీ కృపలానీ హెచ్చరించారు. శ్రీ పటేల్ విభజనను నిరసిస్తూ ఆనాడు చేసిన ఉపన్యాసాలకు పాకిస్థాన్ సయితం అభ్యంతరాన్ని తెలిపింది. మహాత్మాగాంధీగారైతే ఒక అడుగు ముందుకు వెళ్ళి "దేశాన్ని జీవచ్ఛేదం చేసేముందు నన్ను జీవచ్ఛేదం చేయండి" అని మొరపెట్టుకున్నారు. డా. రాజేంద్రప్రసాద్‌గారైతే "ఏ కోణంలో వాదించినా విభజన ఏమాత్రం ఆచరణీయంకాదు, క్షేమం కూడా కాదు." అన్నారు. "దేశ విభజన వలన భారతదేశం బలహీనమవుతుంది" అని చెప్పారు అరవిందఘోష్. అయితే పండిత నెహ్రూ మాత్రం ఒక శుభ ముహూర్తాన "విభజన రద్దు" ను కోరడం బుద్ధిలేని మాట ( Fantastic Nonsence ) అన్నారు. ఇది ఆనాటి పరిస్థితి.

అయితే ఈనాడు ఆ మహానుభావులందరూ కాలగర్భంలో కలిసిపోయారు. విభజన రద్దు కావాలనే అభిప్రాయం వెలిబుచ్చేవారెవరూ నేడు మనకు కనిపించడం లేదు. ఎవరైనా ఆ అభిప్రాయాన్ని వెలిబుచ్చితే వారు మతోన్మాదులు అయి వుంటారని నేటి నాయకులు అభిప్రాయపడుతున్నారు. "విభజన రద్దు కాకపోతే భారతదేశ భవితవ్యమే అయోమయమైపోతుంది. రక్షణ కూడా ఒక ప్రశ్నే అవుతుంది" అనిన అరవిందఘోష్ మాటలు మాత్రం నేడు యదార్థ స్వరూపం దాల్చాయి. సరిహద్దు రాష్ట్రములలో విదేశీయుల అక్రమ ప్రవేశం జరుగుతున్నది. అస్సాం విదేశీయులతో నిండిపోతున్నది. అతివాద శిక్కులు పాకిస్తాన్‌లో తర్ఫీదు పొంది, అధునాతన ఆయుధాలతో సరిహద్దులను దాటివచ్చి మారణహోమం సృష్టిస్తున్నారు పంజాబులో. కాశ్మీర్, చైనా సరిహద్దు సమస్యలు రావణాసురుడి కాష్టంలాగే తగలబడుతునే వున్నాయి. దొంగ రవాణా వ్యాపారం, స్మగ్లింగ్ వ్యాపారం రోజు రోజుకు పెరిగిపోతున్నది. ఈనాడు సరిహద్దు రక్షణ సమస్య మన ప్రభుత్వానికి ఒక సమస్యగా తయారైంది. వేల కోట్ల రూపాయిలు సరిహద్దు రక్షణమీద వ్యయం చేస్తున్నప్పటికీ ప్రయోజనం కనపడటంలేదు. అంతఃకలహాలు తారస్థాయి నందుకుంటున్నాయి. విదేశీ మిషనరీల బెడద, అరబ్బు డాలర్ల మహిమ పెరిగిపోతున్నది. విదేశీయుల కుట్రల వలన మత ప్రాతిపదిక పై ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాలు తలఎత్తుతున్నాయి. ఆనాడు విభజనను అంగీకరించి వుండకపోతే ఈనాడు ఈ విషమ పరిస్థితి దాపురించి వుండేది కాదేమో! నాయకులు ఉద్యమాలు నడిపి నడిపీ విసిగిపోవడం వలననూ, ఏదో విధంగా అధికారం చేబట్టాలనే కాంక్ష మనసులలో ప్రవేశించడం వలననూ, అన్నిటికన్నా దూరదృష్టి లేకపోవడం వలననూ ఆనాడు మన నాయకులు తొందరబడి దేశ విభజనకు అంగీకరించారు. దాని పర్యవసానం ఈనాడు మనం అనుభవిస్తున్నాం. ఒక చిన్న రాజకీయ పొరపాటు నిర్ణయానికి తరతరాల ప్రజలు ఏ విధంగా నష్టపోతారో, జాతి యావత్తూ ఏ విధంగా క్రుంగిపోవలసి వస్తుందో, దేశం ఎటువంటి సంకట పరిస్థితులను ఎదుర్కొనవలసి వస్తుందో! ఇది ఒక చక్కని ఉదాహరణ. భవిష్యత్తులోనయినా సరే రాజకీయ నాయకులు తొందరపడి, అనాలోచితమైన నిర్ణయాలను గైకొనకుండా దూరదృష్టితో వ్యవహరిస్తారని ఆశిద్దాం. ఇదే ఈనాటి 'శ్రీవాణి' సందేశం. 

# దేశ విభజన వలన భారతదేశం బలహీనమవుతుంది

రవింద ఘోష్

ఆగస్టు 15 అరవిందయోగి జన్మదినం. మనకు స్వాతంత్ర్యము వచ్చిన శుభదినంకూడాను. ఆయనకు వివిధ విషయాలపై స్పష్టమైన అభిప్రాయాలు ఉండేవి. ఆ అభిప్రాయాలను ధైర్యంగా స్పష్టం చేయడం ఆయన సహజ ప్రవృత్తి. ఎవరేమనుకుంటారో నని భయపడేవాడుకాదు. నిష్కర్షగా చెప్పడం ఆయన అలవాటు. ఈనాటి రాజకీయ నాయకుల లాంటివాడు కాదు ఆయన. ఈనాటి నాయకులకు రాజకీయాలు మాత్రం తెలుసు. అందులో దేశరాజకీయాల మీద సంపూర్ణమైన అవగాహన గలవారు బహూకొద్దిమంది మాత్రమే.చాలామంది రాజకీయ నాయకులు స్థానిక సంస్థల రాజకీయాలకే పరిమిత మైనారు. ఆయన స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొనిన మహావీరుడు. అంతేకాదు, ఆధ్యాత్మికచింతన గల మహనీయుడు 1947లో భారతదేశ విభజన జరిగినప్పుడు ఆయన తన మనోభావాలను స్పష్టీకరించారు. "భారతం స్వేచ్ఛను పొందింది. కానిఐక్యతను సాధించలేకపోయింది. తునాతునకలైన స్వాతంత్ర్యాన్ని సాధించాం. దీనిని శాశ్వతమని భావించక, ఇది ఒక తాత్కాలిక నిర్ణయంగా భావించాలి. ఎందువల్లనంటే ఈ విభజనే శాశ్వతమైతే భారతదేశం చాలా బలహీనమైపోతుంది. దెబ్బతింటుంది కూడాను. అంతః కలహాలు అనివార్యం కావచ్చు, విదేశీయుల ప్రవేశంకూడా జరుగవచ్చు." అని అరవింద మహాశయుడు ఆనాడే దూరదృష్టితో అభిప్రాయాలను స్పష్టం చేసారు. అంతేకాదు "విభజనే రద్దుకాకపోతే భారతదేశ భవితవ్యమే అయోమయమై పోతుంది. రక్షణకూడా ఒక ప్రశ్నే అవుతుంది." అని ఆయన ఏనాడో చెప్పారు. ఆయన ఊహించిన విషయాలు నేడు యదార్థ వాస్తవరూపం దాల్చాయి. విదేశీయుల అక్రమ ప్రవేశం జరుగుతున్నది. అస్సాం విదేశీయులతో నిండిపోతున్నది. అతివాద శిక్కులు, పాకిస్థాన్‌లో తర్ఫీదు పొందుతున్నారు. వారి ఆయుధాలతో నగర సరిహద్దులను దాటి వచ్చి పంజాబులో మారణహోమం సృష్టిస్తున్నారు. సరిహద్దు రక్షణ ఒక సమస్యగా తయారైంది. వేలకోట్ల రూపాయలు ఖర్చుచేస్తున్నప్పటికీ ప్రయోజనం లేకుండాపోతున్నది. అంతః కలహాలు తారస్థాయినందుకుంటున్నాయి. ఒక చంప విదేశీ క్రైస్తవ మిషనరీల బెడద, మరొక చంప అరబ్బు దేశాల డాలర్లతో మహమ్మదీయ ప్రచారం, మతప్రాతిపదికపై ప్రత్యేక రాష్ట్రాల ఉద్యమాలు నానాటికీ పెచ్చుపెరుగుతున్నాయి. ఆనాడు దేశ విభజనకు అంగీకరించి ఉండకపోతే ఈనాడు ఇన్ని విషమ సమస్యలను ఎదుర్కొనే పరిస్థితి ఏర్పడి ఉండేదికాదు. అరవిందఘోష్, మహాత్మాగాంధీజీలాంటి పెద్దల మాటలను లెఖ్ఖచేయక దేశాన్ని విభజించడానికి మన నాయకులు అంగీకరించడం వలన నేడీ దుస్థితి మనకు దాపురించింది.

అరవింద మహాశయునికి భారతావని యడల అచంచలమైన, భక్తిపూర్వకమైన, పవిత్రభావం ఉండేది. ఆధ్యాత్మిక శక్తియడల పూర్తి విశ్వాసం ఉండేది, ఆయన చెప్పిన మాటలను పరిశీలిస్తే ఈ విషయం మనకు బోధపడుతుంది. "భారతమాత ఒక మట్టిముద్దకాదు. ఆమె శక్తి స్వరూపిణి. మనది సనాతనమైన దేశం. మనది సనాతనమైన ధర్మం. ఈ ధర్మంయొక్క ఉత్కృష్టత, పటిష్టత, పవిత్రత కొంత కాలం మరుగున పడవచ్చు. కాని ఏ నాటికీ దానికి నశింపులేదు. వీరుడు, ఋషి, ముని-వీరు మన భారతభూమిలో పండిన ఫలాలు. మన చరిత్రలో వీరు జన్మించని యుగంలేదు. వివిధ దేశాలవారు మన భారతదేశం వైపు చూస్తున్నారు. భారతీయ సిద్ధాంతాలనే కాదు, యోగసాధనలను కూడా తెలుసుకోవాలని తాపత్రయ పడుతున్నారు. ఆధ్యాత్మిక తత్వంకోసం మనపై ఆధారపడుతున్న ఈ తరుణంలో భారతదేశం తన సాంస్కృతిక

## విదురనీతి

" మహారాజా! దీర్ఘకాలం నిద్రిస్తూ నిద్రను జయించలేము. కామ భోగాలు సాగిస్తూ స్త్రీలను జయించలేము. అధికంగా త్రాగుతూ మద్యాన్ని జయించలేము. ధన ధాన్యములతో మిత్రులు, అన్నపానాలతో స్త్రీలు, విజయంతో శత్రువులు వశీభూతులు కావాలి. మీరు లోభాన్ని విడిచిపెట్టండి. ఈ భూమండలంలోని ధనధాన్య కామినీ కాంచన పశు సంపదలన్నీ లభించినా ఒక్కొక్కడు తృప్తి పడలేడు. అది మనిషి యొక్క స్వభావంలో ఉంటుంది. "

వారసత్వాన్ని త్రోసి పుచ్చడం విధివైపరీత్యమే అవుతుంది " అని ఆయన ఆవేదన చెందారు మనదేశ ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని మనం మరచిపోయాం. కొన్ని దశాబ్దాల బానిసత్వం వలన ఆత్మ విశ్వాసాన్ని కోల్పోయాం. ఆత్మవిస్మృతిని పొందాం. మన గమ్యాన్ని, మన వారసత్వాన్ని విస్మరించి భౌతిక సంబంధమైన విషయాల మీదనే కేంద్రీకరిస్తున్నాం. భౌతిక సంబంధమైన విషయాలమీద కేంద్రీకరించ కూడదని నా అభిప్రాయంకాదు. భౌతిక సంపందతో పాటు ఆధ్యాత్మిత సంపదను కూడా సంపాదించినప్పుడే తిరిగి మనం ప్రపంచానికి ఒక దివ్య సందేశమును యివ్వగలుగుతాం. తిరిగి జగద్గురు స్థానాన్ని పొందగలుగుతాం, ప్రపంచ శాంతికి దోహదం చేసినవార మవుతాం. ఒకచెంప విదేశీయులు మనశ్శాంతిని కోల్పోయి మన యోగవిద్యద్వారా తిరిగి మనశ్శాంతి పొందాలని తాపత్రయపడుతుంటే, మన సనాతనమైన యోగవిద్యకు భారతదేశంలో యివ్వవలసినంత ప్రాధాన్యత మన ప్రభుత్వం యివ్వకపోవడం శోచనీయం. విద్యావిధానం మారాలని నాయకులు ఉపన్యాసాలు జోరుగా చెబుతున్నారు. మనకు గర్వ కారణమైనదే గాక, పాశ్చాత్య దేశాలవారు సహితం కావాలని తాపత్రయపడుతున్న ఆధ్యాత్మిక విద్యను మనం పూర్తిగా విస్మరిస్తున్నాం. నైతిక, శీలసంపత్తులను యినుమడింపజేసే విద్యను బాలబాలికలకు అందించ లేకపోతున్నాం. ఎన్ని ఉన్నత డిగ్రీలు సంపాదించి నప్పటికీ, శీలభ్రష్టులైన వారి వలన దేశానికి ఏ మాత్రం ప్రయోజనం ఉండదు. ప్రయోజనం లేకపోగా అట్టివారి వలన ప్రమాదం కూడ వచ్చి మీద పడుతుంది. కనుక భౌతిక విద్యతోపాటు నైతిక ఆధ్యాత్మిక శీలసంపత్తులను ఇనుమడింపజేసే విద్య కావాలని మహాత్మా గాంధీజీ సహితం కోరారు. ఇటువంటి విద్యను తరగతులలో బోధించాలి. అది విస్మరిస్తే మన దేశ భవిష్యత్తే అంధకార బంధుర మవుతుంది.

అరవిందులకు భారతీయ సనాతన ధర్మ సంస్కృతుల యెడల సంపూర్ణ విశ్వాసం ఉండేది. " భారతీయ ఆధ్యాత్మిక తత్వం యొక్క వ్యావహారిక స్వరూపమే ఈ సనాతన ధర్మం. ఇది కేవలం గుడ్డిగా నమ్మదగినదికాక జీవితంలో అనుష్ఠింపదగినది, ఆచరింపదగినది. మానవ కళ్యాణం కొరకు ఈ ద్వీపకల్పంలో చరిత్ర కందని కాలం నుంచి భద్రపరచబడిన ధర్మం ఇది. ఈ ధర్మాన్ని ప్రపంచానికి ప్రసాదించవలసిన బాధ్యత మనమీద ఉన్నది. అంతః,బాహ్య అనుభవాల ద్వారా ఉన్నతిని పొంది, చివరకు దైవత్వాన్ని చేరుకోవడం, ఆత్మసాక్షాత్కారాన్ని పొందడం జరగాలి. మానవ జీవితానికి దీన్ని మించిన ఆదర్శం ఏముంటుంది? భారతీయ సంస్కృతి కృషిలోని పరమార్థం ఇదే. " అని అరవిందులు పేర్కొన్నారు. మహాత్మాగాంధీజీ కూడా ఇదే తత్వాన్ని ప్రబోధించారు. ఆయన చంకలో భగవద్గీత ఉండేది. భగవద్గీత పవిత్రమైన ఉత్తమగ్రంథమని, ప్రపంచానికి ప్రబోధించే ఉత్తమ ఆదేశాలు ఎన్నో దానిలో ఉన్నాయని, విపత్కర పరిస్థితులు సంభవించినప్పుడు మనశ్శాంతిని ఇచ్చేందుకు, పరిష్కార

మార్గాలను చూపేందుకు ఎన్నో అమూల్యమైన విషయాలు దానిలో ఉన్నాయని మహాత్మాగాంధీజీ విశ్వసించేవారు. " సంశయములు నన్నావరించినప్పుడు, సంకటములు సంప్రాప్తమైనప్పుడు, నిరాశా నిరుత్సాహములు జనించి నపుడు నేను భగవద్గీతను తెఱచి చూచుదును. అందు ఏదో యొక శ్లోకము నన్నూరడించును. " అని చెప్పిన గాంధీజీ మాటలను మనం విస్మరించాం. " రామరాజ్య మును తిరిగి స్వతంత్ర భారతంలో పునః ప్రతిష్ఠించ దలచాను. " అని చెప్పిన గాంధిజీ పలుకులను మనం మరచిపోయాం. ఒక చంప రాజకీయ మహోద్యమాలను నడుపుతూ ప్రజలను ఆధ్యాత్మికంగా చైతన్యవంతులను గావించడానికి గాంధీజీ, అరవింద ఘోష్ లాంటి ప్రముఖులు కృషి చేసారు .అయితే వారి వారసులమని చెప్పుకుంటున్న నేటి రాజకీయ నాయకులు వాటిని విస్మరించారు. రాజకీయ అధికారం కోసం పడరాని పాట్లు పడుతూ, భారతదేశ అసలు ఔన్నత్య సంపదైన ఆధ్యాత్మిక సంపదను పెంపొందించేందుకు ఏ మాత్రం ప్రయత్నం చేయడం లేదు. పైపెచ్చు ఆధ్యాత్మికను గురించిగాని, భారతీయ ధర్మ సంస్కృతులను గురించిగాని మాట్లాడటం మత మౌఢ్యమని సెక్యులర్ తత్వానికి అది వ్యతిరేకమని, ఆ విధంగా మాట్లాడేవారు ఛాందసులని భావించడం నిజంగా దురదృష్టకరం.

అరవిందుల బుద్ధిపటిమ అపారమైనది. కౌమార వయస్సులో విద్యాభ్యాసమంతయూ ఇంగ్లండులో జరిగిన కారణం వలన ఆయన ఆదిలో ప్రాశ్చాత్య విజ్ఞానమంతనూ ఆపోశనము పట్టినారు. తరువాత భారతీయ విజ్ఞాన సంస్కృతుల వైభవానికి ఆయన హృదయం ఆకర్షిత మైనది. భారతీయ విజ్ఞానాన్ని ఉపాసించే సందర్భంలో ఆయనకు యోగవిజ్ఞాన సాక్షాత్కారం కూడా అయింది. బుద్ధి సహితం అందుకోజాలని సత్యజ్ఞాన సాక్షాత్కారము యోగం వలననే సాధ్యమని ఆయన గ్రహించారు. సాధనలో నిమగ్నులైనారు. మంత్రద్రష్టలైన వేదఋషి వాక్కులలో గర్భితములైన పరమ రహస్యములు సహితం ఆయనకు తేటతెల్లములైనవి. భగవద్గీతలో బోధించిన కర్మయోగ సిద్ధాంతం పూర్తిగా అవగతమైంది. అహంకార మమకారములను విసర్జించి, స్వీయాభీష్టముల నావలకు పారద్రోలి ఈశ్వరేచ్ఛానుసారము వర్తించుటెల్లో ఆయన తెలుసుకున్నారు. దేశస్వాతంత్ర్య సమరంలో అగ్రగామిగా నిలచిన ఆయన దానిని వదిలేసి పుదుచ్చేరి చేరి అవ శేష జీవితాన్ని అక్కడ ఆధ్యాత్మికమార్గంలో గడిపారు.

అరవిందులు 1914-1921 మధ్యకాలంలో "ఆర్య" అనే ఇంగ్లీషు పత్రిక ద్వారా తాము నమ్మిన ఆధ్యాత్మిక తత్వమును ప్రచారం చేసినారు. ఆయన దృష్టిలో జగత్తు మిధ్యకాదు. అర్థరహితమైన మాయా కల్పన కాదు. అరవిందుల దర్శనం అద్వైత దర్శనమేగాని, మాయా ద్వైతం కాదు. ఏకమునకూ అనేకమునకూ పరస్పర వైరుధ్యం లేదని ఆయన హెచ్చరిక. ఏకత్వ నిరూపణకు అనేకత్వమును తుడిచిపెట్టి దాని అస్తిత్వమునే నిరాకరించ వలసిన పనిలేదని ఆయన నమ్మకం. ఏకమునందలి అభేదత్వమెటుల సత్యమో, అనేకము నందలి భేదములు కూడా అటులనే సత్యములని ఆయన అభిప్రాయము. కాని, అనేకం ఏకమునందు నిష్ఠమై ఏకము వలననే మను చున్నది. సృష్టియందు కానవచ్చు భేదములు అభేద వస్తువు యొక్క అభివ్యక్తిలో కాననగు వైవిధ్యము మాత్రమే. ఏకత్వం మూలమై అనేకత్వము, ఆ ఏకత్వం పైన ఆధారపడివున్నా, రెండునూ ఆ పరమ సత్యపు భిన్న ముఖము లేనని ఆయన అభిప్రాయపడ్డారు.

పూర్ణయోగ సాధన అహంకారంతో చేసెడిది కాదని ఆయన విశ్వాసం. అ హ ం కా ర ం లవలేశంకూడా ఈ సాధనలో ఉండరాదని, దానిని త్యజించి, ఈశ్వరార్పణ గావించుకొని కొనసాగించ వలసిన సాధనమని చెప్పారు. ఆయన మాటలలో " ఈ ప్రపంచం ఈశ్వరుని నాటకశాల, ఈశ్వరుడే నటుడు, నీవాయన ధరించిన వేషం. ఇది నీవు గుర్తించి, నీ ద్వారా ఆయననే నటించనీ. జనులు నిన్ను మెచ్చినా, గేలిచేసినా, వారుకూడా వేషాలేఅని తెలుసుకో. నీలోనిఈశ్వరునే నీ విమర్శకునిగా ప్రేక్షకునిగా గ్రహించు.

## డబ్బు

"డబ్బు అంటే సంపద యొక్క శవం. డబ్బును చూసి ఎగబ్రాకేవాడు, తాపత్రయ పడేవాడు, జబ్బు పడేవాడే. లక్షల రూపాయలు సంపాదించి ఎవ్వరికీ తెలియకుండా ఒక పెట్టెలో జాగ్రత్తగా దాచుకున్నావనుకో ! నీలాగే ఇంకొక సోదరుడు జాగ్రత్తగా దాచుకుందామని ఎవ్వరికీ కనపడకుండా పట్టుకుపోతాడు.

"ఇప్పుడు మనం తలపెట్టిన పనులన్నీ నెరవేరాలంటే డబ్బులు ఉండాలి" అంటారు కొంతమంది. డబ్బులు ఉండవు. పనులు ఆగవు. నెరవేరుతూనే ఉంటాయి. డబ్బులు ఉంటే పనులు నెరవేరవు. వస్తున్న డబ్బులు వినియోగపరుస్తూ ఉంటే పనులు నెరవేరుతుంటాయి. డబ్బులు మిగిలివుండేట్లు చూచుకొనే వారికి పనులు నెరవేరవు. ఈ ధర్మ సూక్ష్మములోని సత్యాన్ని నమ్మని వాళ్లకి డబ్బులు వినియోగపరచే ధైర్యముండదు. అంటే పనులు నెరవేర్చే సామర్థ్యముండదు. డబ్బులు దగ్గర పెట్టుకొని అనుమానపడుతూ, వాళ్లు ఆయుర్దాయాన్ని కాజేసుకుంటారు. వాళ్లు చనిపోయిన తరువాత ఇంకొకడు ఆ డబ్బుల్ని కాల్చేస్తాడు."

వేషాలు చూచి కలతచెందుతావెందుకు ? పైకి అప్రియంగానో, జుగుప్సాకరంగానో కనిపించే ఆ వేషాలమాటు నుండి కృష్ణ భగవానుడు నీ అవివేకపు కోపానికీ, అంతకంటే అవివేకపు జుగుప్సకూ, ఇంకా అంతకంటే అవివేకపు భయానికీ నవ్వుతుంటున్నాడు. ఇతరులను నిరసించే లక్షణం నీలో పొడసూసినప్పుడెల్ల, నీ హృదయంలోనికి దృష్టిసారించుకొని నీ అవివేకానికి నవ్వుకోవడం నేర్చుకో. ఈశ్వరుని దృష్టిలో అల్పమైనది ఏదీలేదు. అట్లే నీదృష్టిలోనూ ఉండరాదు. ఒక మహా సామ్రాజ్యనిర్మాణానికి వెచ్చించినంతటి దివ్యపరిశ్రమనే ఆయన అతి అల్పమైన ఒక నత్తగుల్ల నిర్మాణానికి సైతం వెచ్చిస్తూవుంటాడు. నీ మట్టుకు నీవు, భోగలాలసుడూ, అసమర్థుడూనైన రాజుగావుండే కంటే, చెప్పులు కుట్టడంలో నేర్పరితనం గల మాదిగవాడుగా వుండటం మేలు" అని అరవిందులు చెప్పిన మాటలో ఎంతటి అర్థం నిగూఢమై వున్నదో తేటతెల్లమవుతున్నది. భోగిగా జీవించడం కంటే యోగిగా, కర్తవ్య పరాయణుడుగా జీవించడంలోనే పరమార్థమున్నదని ఆయన నమ్మిక.

అతి ముఖ్య సుగుణాలను గురించి అరవిందులు వివరిస్తూ "ధైర్యమూ, ప్రేమ" అనే రెండు సద్గుణాలు తప్పనిసరిగా ప్రతి వ్యక్తిలో ఉండాలని ఆయన స్పష్టం చేసారు. ఏపని సాధించాలన్నా ధైర్యం అత్యవసరం. అది లేకుండా కార్యసాధకుడు కాలేడు. ప్రేమలేని వ్యక్తి, ప్రేమించని వ్యక్తి వలన సమాజానికి ప్రయోజనం ఏ మాత్రం ఉండదు. ప్రేమతో సాధించలేనటువంటి అసాధ్యమైనదీ ఏదీ లేదు.

మానవ సమాజోద్ధరణ జరగాలంటే ప్రతి జీవుడు తనదిగా చెప్పుకునేదంతా తనలోని ఈశ్వరునికి సమర్పించుకున్నప్పుడే, వ్యక్తి పరిపూర్ణుడు కాగలుగుతాడని, అట్లే మానవజాతి తనకు కలిగినదంతా ఈశ్వరార్పణ చేయగలిగినప్పుడే మానవ సమాజానికి పరిపూర్ణత సిద్ధిస్తుందని అరవిందుల నమ్మకం.

అరవిందుల ఆధ్యాత్మిక బోధనలు మానవాళి అనుసరించినప్పుడు, ఆచరించినప్పుడు భారతదేశం ప్రపంచానికి సందేశం, ఆదేశం యివ్వగలుగుతుంది. ఆ శుభ దినం కోసం వేచి ఉందాం.

- కొమరగిరి

# శ్రీ అరవిందుని అపూర్వత

ఇది ఒక అపూర్వసమయం, యుగయుగాల్లో ఎపుడో ఒకసారి గాని ఇట్టి అద్భుత సమయం ఆవిర్భవించదు కాగా ఇట్టి మహత్తర కాలంలో జన్మించడం మన అదృష్టం ! అయితే ఈ అదృష్టానికి ఎవరి జన్మ, కర్మలు కారణమో, ఆ మహాత్ముని గురించి మన మిపుడు దిఙ్మాత్రంగా కొన్ని ముఖ్య విశేషాలను తెలిసికొందాం.

## అవతారకార్యం

ధర్మ సంస్థాపనకొరకు భగవంతుడు అవతరిస్తాడు, సరే; కాని ధర్మ సంస్థాపనమంటే? ఏముంది? ఏ రావణాసురునో రూపుమాపి, యథాపూర్వ స్థితిని పునరుద్ధరించడం, శాంతి భద్రతలను తిరిగి నెలకొల్పడం- అని వ్యాఖ్యాతలందరూ చెప్తారు. కాని, శాంతిభద్రతల నిమిత్తమే అయితే ఒక విభూతి సరిపోతుంది, సాక్షాదవతారమే రానవసరంలేదు- అని శ్రీ అరవిందుడు ఆ వ్యాఖ్యను కొట్టివేశారు.

ధర్మ మంటే ఊర్ధ్వధర్మం, పరిణామధర్మం, ధర్మ సంస్థాపన మంటే అట్టి ఊర్ధ్వ ధర్మాన్ని స్థాపించడం, పరిణామాన్ని మరొక మెట్టు పైకి గొనిపోవడం. ఇక పరిణామమంటే ముఖ్యంగా చేతన యొక్క పరిణామం, పాశ్చాత్యులు ప్రతిపాదించిన రూపముయొక్క పరిణామం గౌణం మాత్రమే, ముఖ్య పరిణామానికి ఒక సాధనం మాత్రమే.

పైగా, శాంతి భద్రతలను అస్తవ్యస్తం చేసిన అసుర శక్తుల అడ్డును తొలగించినంత మాత్రాన, ఇది స్వయంగా జరిగే పరిణామంకాదు. మానవత్వానికి, దివ్యత్వానికి నడుమ నున్న గోడను ఛేదించుకొని, దివ్యత్వము మానవత్వంలోనికి దిగినపుడే- "అవతరించినపుడే-" ఇది సాధ్యం- అని శ్రీ అరవిందుడు లోతుల లోనికి దిగి కూడా వివరించారు. ఇట్లు అవతారం దుష్టశిక్షణ కొరకు మాత్రమే కాదు, చేతనా పరిణామం నిమిత్తం- ముఖ్యంగా. అందు చేత, " పరిణామంతో సంబంధం లేకపోతే, అవతార భావనకు అర్థమే లేదు " అని ఆయన వక్కాణిస్తారు :

ఇదిగో, ఇది శ్రీ అరవిందునియొక్క ఒక అపూర్వ దర్శనం హిందూ మతము నందలి దశావతారాల ఉత్తరోత్తర అనుక్రమమునందు గూడ ఈ పరిణామ ధర్మాన్నే వారు దర్శిస్తారు.

చెలసాని నాగేశ్వరరావు

## అతిమనస్సు దర్శనం

తన యోగానుభవమునందు శ్రీ అరవిందుడు దర్శించిన మరొక అపూర్వ వస్తువేమిటంటే, అతిమనస్సు. మనస్సు జ్ఞానము దిశగా పురోగమిస్తున్న అజ్ఞానం, అర్ధజ్ఞానం. ఇది జ్ఞానాన్ని అన్వేషించి తెలిసికోవాలి. అంతేకాని, జ్ఞానం దీని సహజ సంపత్తి కాదు. కాని దీనికి మూలమైన ఒక చేతన లేక చిచ్ఛక్తి గలదు. ఇది జ్ఞానము నన్వేషించవలసరంలేదు; జ్ఞాన, విజ్ఞానములు దీని సహజ సంపత్తి. ఇది సక్రియము, సృజనాత్మకమూ అగు సాక్షాత్తు భగవంతుని చేతనయే. వైదిక యుగం తర్వాత దీనిని ప్రప్రథమంగా దర్శించినవాడు శ్రీ అరవిందుడు. మనస్సునకు మూలమయినా, ఇది మనస్సునకు అతీతం గనుక, దీనిని శ్రీ అరవిందుడు అతిమనస్సు అన్నారు; అలాగే దీనికి సత్యం కరతలామలకం గనుక, దీనిని సత్య-చేతన (Truth - consciousness) అన్నారు. కాగా వైదిక ఋషులు దీనికిడిన నామం " సత్యం ఋతం బృహత్ ". అతి మనస్సు, ఇదీ ఒకటే-, అని లక్షణములను బట్టి పోల్చుకో గలిగిన ప్రతిభ కూడ శ్రీ అరవిందునికే దక్కుతుంది.

## ఈ ప్రజాస్వామ్యంలో…

సంరక్షించవలసిన 'లాఠీకఱ్ఱ'
సధర్మంగా పాలించవలసిన
'టోపీ బుఱ్ఱ'
'శకారుని వేషంలోనూ'
'గిరీశం' రూపంలోనూ
సామాన్యుల్ని
సదమద మొనరిస్తున్నాయి !

కె. కిశోరుబాబు
కె. అశోకుబాబు

## కలియుగ భగీరథుడు

ఈ అతిమనస్సు దర్శనంతోనే శ్రీ అరవిందుడు ఆగిపోలేదు. ఈ దర్శనం అపూర్వమే అయినా, శ్రీ అరవిందుని పూర్ణయోగంలో, ఇది పూర్వాంగం మాత్రమే, ఆరోహణ మాత్రమే. ఈ యోగముయొక్క ప్రధాన తత్త్వం అవరోహణ, అతిమనస్సు క్రిందనున్న మానవ ప్రకృతిలోనికి అవరోహించడం : ఈ అవరోహణ లేక అవతరణ చేతనే పరిణామం, ఊర్ధ్వతర పరిణామం, సాధ్యం (చూ. ప్రకరణం 1). ఈ అవతరణ నిమిత్తం శ్రీ మాతారవిందులు ఎంత భారం వహించారో, ఎన్ని కష్టాలు పడ్డారో, ఎన్ని యుద్ధాలు చేశారో, ఎన్ని గాయాలను సహించారో, ఏ కీకారణ్యాలలోనుంచి పయనించారో, ఏ అభేద్య పర్వతాలను తొలుచుకొని వెళ్లారో, ప్రతీప శక్తులను జయించారో ! – "ఇట్టి కృషిని, నేను నిశ్చయంగా చెప్పగలను, మునుదెవ్వరు చేయవలసి రాలేదు" – అని శ్రీ అరవిందుడు అవధరించి పలికారు. ఈ అపూర్వ కృషి ఫలితంగా అతిమానస శక్తి 1956, ఫిబ్రవరి 29న పృథివీతత్వము యొక్క సూక్ష్మభౌతికంలోని కవతరించి, అక్కడిపుడు తీవ్రంగా తన పని కొనసాగించుతోంది. పృథివీలోకము యొక్క స్వరూపమునే మార్చివేయగల ఇంతటి అద్భుత సంఘటన ఆనాడు సంభవించితే, అది, శ్రీ మాతారవిందులతో సంబంధంగల 3, 4 గిరికి తప్పితే, మహాత్ములనబడే మహాత్ములకు గూడ లవలేశమైనా తెలియకపోవడం ఎంత విడ్డూరం ! ఆనాడు గంగావతరణం ; ఈనాడు విజ్ఞానావతరణం ; అతడు భగీరథుడు, ఇతడు శ్రీ అరవిందుడు ; దాని ఫలితం పితరులకు సద్గతి, దీనిఫలితం సర్వులకు, సర్వ మానవులకు, దేవతలు కూడఆశించలేని దివ్య జీవనం !

వైదిక ఋషులు అతిమనస్సును దర్శించారు గాని, దాని అవతరణకు కృషి చేయలేదు. పైగా "సూర్య కవాటం ద్వారా ముందుకు వెళ్ళిన వాడెవ్వడు పార్థివ శరీరాన్ని నిలుపుకోలేడు". అని కూడ చెప్పారు, అంటే వారి దృష్టిలో దివ్య జీవనం అసంభవం (సూర్యుడు అతిమనస్సునకు సంకేతం). అట్టి అసంభవాన్ని సంభవము గావించినవాడు శ్రీ అరవిందుడు. ఇచ్చట ఈ ఉల్లేఖనం సముచితమవుతుంది : "నేను అతిమానసీకరణానికి ప్రయత్నించుతున్నాను అంటే, అది పృథివీ చేతనకు ఆవశ్యకం మరియు అది నాలోనే ముందు జరుగకపోతే, ఇతరులలో జరుగజాలదు". తన జీవితకాలంలో ఇలా వక్కాణించిన శ్రీ అరవిందుడు తన ఆశయసిద్ధిని త్వరితం గావించేందుకు తన శరీరాన్ని బుద్ధిపూర్వకంగా బలిపెట్టే ముందు మనకిచ్చిన మాట ఇది :

"అతిమానస విధానంలో సృజించబడిన ప్రథమ అతిమానస మానవునిగా నేను తిరిగివస్తాను". అతిమానస విధానంలో, అంటే మాతాపితల అవసరం లేకుండా-అని అర్థం.

ఇలా, అతిమనస్సు, ఆధ్యాత్మిక పరిణామము, దివ్య జీవనము, దివ్య శరీరము : ఇవి మానవజాతి కొరకు ఆయన సాధించిన, సాధించనున్న అపూర్వతలు.

## శ్రీ అరవిందుడు – భారతం

కాని ఈ అపూర్వతలను సాధించేందుకు భారత స్వాతంత్ర్యం, అఖండత అత్యంతావశ్యకము. కావున

భారత స్వాతంత్ర్యం, పిమ్మట ప్రపంచానికి భారత నాయకత్వం ఆయన మహాలక్ష్యాల్లో రెండుగా విలసిల్లాయి. ప్రథమ స్వాతంత్ర్యదినానికి ఆయన ఇచ్చిన సందేశమిది : నా జన్మదినమైన ఆగష్టు 15 నాడే స్వాతంత్ర్యం రావడం కాకతాళీయం కాదు. ఈ విషయంలో నా కృషి ఫలించిందని తెలియజేయడానికి భగవంతుడు దానిపైన వేసిన ఆమోదముద్ర.

అయితే భారతంపై ఆయన కంత మక్కువేమిటి ? వినండి : " ప్రపంచాన్ని పరిరక్షించగల జ్ఞానాన్ని భారతం పరిరక్షించుతోంది. "

" భారతం ప్రపంచానికి తన ఆధ్యాత్మిక నాయకత్వాన్ని నిలుపుకోవాలి ; ఆమె అలా చేయకపోతే, ఆమె, ఆమెతో బాటు ప్రపంచమూ కుప్పగూలిపోతాయి. "

" భగవంతుడు ఒక ప్రత్యేక దేశాన్ని ఎన్నుకొని, దానిని కాపాడుతూ ఉంటాడు, ఆ దేశమునందు పరమార్థ జ్ఞానము కొద్దిమంది చేతనో, ఎక్కువమంది చేతనో సర్వకాల సర్వాపాయములందూ నిరంతరంగా రక్షింపబడుతూ ఉంటుంది. కనీసం ఈ చతుర్యుగమునందు భగవంతుడెన్నుకొన్న ఆ దేశం భారతదేశమే. "

శ్రీ అరవిందుడు కె. యం. మున్షీకి ఇంకా ఇలా ధైర్యం చెప్పారు : " మున్షీ ! ఈ విశ్వాస దౌర్బల్యాన్ని నీవు అధిగమించాలి ! నిశ్చింతగా ఉండు, మన సంస్కృతి ఎప్పటికి నశించజాలదు. ఇది ఒక తాత్కాలిక దశ మాత్రమే. " " India will be reunited, I see it clearly " - ఇండియా తిరిగి ఏకమవుతుంది, దాన్ని నేను స్పష్టంగా చూస్తున్నాను.

ఈ సనాతన సంస్కృతి నెవరు చాటుతారు ? ప్రత్యేక దర్శనంలో రవీంద్ర కవీంద్రు డిలా అన్నారు : "మీలో వేదముంది, దానిని మీనుండి స్వీకరించడానికి మేము సిద్ధంగా ఉన్నాము. ఇండియా మీ వాణి ద్వారా ప్రపంచానికి తన సందేశమిస్తుంది ". ఇట్టి యుగపురుషుడు శ్రీ అరవిందుడు.



★

## మీకు తెలుసా ?

మానవునిలోని రక్తనాళాలను వరుసగా పెడితే భూగోళాన్ని 2 సార్లు చుట్టేంత పొడుగు అంటే దాదాపు 50 వేల మైళ్లు వస్తుందట.

* * *

ప్రపంచంలోకెల్లా బరువైన మనిషి రాబర్టుహ్యూగ్స్. ఆతని బరువు 1,069 పౌనులు.

* * *

ఏనుగు తొండంలో సుమారు 1 1/2 గ్యాలనుల నీరు పడుతుంది.

* * *

నీటి కంటే రక్తం 6 రెట్లు చిక్కగా ఉంటుంది. దీనిలో ఎర్రకణాలు 250 కోట్లు. ఘనమిల్లీమీటర్ ఒక్కింటికి 80 లక్షల ఎర్రకణాలుంటాయి. దీనిలో 90 శాతం నీరుంటుంది.

* * *

ఒక సామాన్య వృక్షం రోజుకు 40 గ్యాలనుల నీరును ఆవిరి రూపంలో విడుదల చేస్తుంది.

* * *

నాలుగు మోకాళ్ళున్న ఒకే ఒక జంతువు ఏనుగు.

# చేపలను వేటాడే కోర్మోరాంట్




సముద్రపు ఒడ్డునుండే రాళ్ళమీదకాని పెద్దచెఱువుల గట్లమీదుండే చెట్లమీద కాని కూర్చుని, నల్లటి నిగనిగలాడే శరీరంతో తదేకంగా నీటివైపు చూస్తూ, హఠాత్తుగా నీటిలోకి దూకి, నోటికి చేపను కరచుకుని యథా స్థానానికి వచ్చేపక్షిని ఎవరైనా గమనిస్తే అదే కోర్మోరాంట్. దీనినే సముద్రపు కాకి అనికూడా పిలుస్తుంటారు.

రంగులో కాకిని, ఆకారంలో బాతుని పోలివుంటుంది ఈ పక్షి. పొడవైన, ధృడమైన వంకి తిరిగిన ముక్కు, తెడ్డులా ఏర్పడిన కాలివేళ్ళు- ఇవన్నీ కలిపి కోర్మోరాంట్ నీటిలో ఈదేందుకు, చేపని పట్టుకునేందుకు సహాయపడుతున్నాయి. ఈ పక్షి ఈకలు వదులుగా వుండటంచే నీరు లోపలికి వెళుతుంది. అందువల్ల ఒకసారి వేటకు వెళ్ళి వచ్చినవెంటనే రెక్కలనుచాచి ఆరపెట్టుకుంటాయి.

ఇవి పూర్తిగా చేపల మీదే ఆధార పడినప్పటికి మానవుడికి పోటీకావు. మానవుడు ఆహారంగా తీసుకోని చేపలనే కోర్మోరాంట్ తన ఆహారంగా గ్రహిస్తుంటుంది.

ఇవి ఒంటరిగా జీవించనే జీవించవు. వేలకొలది కోర్మోరాంట్స్ ఒకేచోట గూళ్ళు కట్టుకుంటాయి. కంటికి కనిపించిన వస్తువులన్నింటిని గూటి నిర్మాణానికి వాడుకుంటాయి. చెట్టుకొమ్మల పైనా రాళ్ళ పైనా ఈ పక్షుల గూళ్ళను అనేకం చూడవచ్చు.

కోర్మోరాంట్స్‌లో జంట కట్టటం అనేది వుండదు. మగ, ఆడ పక్షులు రెండూ విచ్చల విడిగా జీవిస్తాయి. రెండునుంచి ఆరు గుడ్లు పెడతాయి. గుడ్లు లేత నీలం లేదా లేత ఆకుపచ్చ రంగులో వుంటాయి. వీటి మీద కొన్ని చారలు కూడా వుంటాయి.

దుగ్గరాజు శ్రీనివాసరావు

దక్షిణ అమెరికాలోని పెరు, చిలి తీరాల్లో ఒకేచోట పది లక్షలకుపైగా పక్షులు నివశిస్తున్నాయి. ఈ పక్షుల రెట్టలు పంట పొలాలకు బలమైన ఎరువుగా ఉపయోగపడుతుంది. ఈ లక్షల కొలది పక్షులువేసే టన్నులకొలది రెట్టను సేకరించి ఎగుమతి చేసి ఈ రెండు దేశాలు భారీ ఎత్తున విదేశ మారక ద్రవ్యాన్ని సంపాదించేవి. కాని ఇటీవల కాలంలో ఈ పక్షుల సంఖ్య తగ్గిపోవటంతో ఈ రెట్టల ఎగుమతి పడిపోయింది.

చేపలను వేటాడే ఈ పక్షుల అలవాటును మానవుడు తెలివిగా ఉపయోగించుకున్నాడు. ఈ పక్షులను మచ్చిక చేసుకుని వీటి మెడకు తాడు కట్టి జాలరులు తమతోపాటు పడవలో తీసుక వెళ్ళేవారు. ఈ పక్షి అలవాటు ప్రకారం వెళ్ళి చేపను పట్టుకుని తిరిగి పడవ మీదికి చేరుతుంది. కోర్మోరాంట్ మెడకు తాడును కొంచెం బిగుతుగా కట్టడంవల్ల అది చేపను మింగలేదు. ఆ చేపను పక్షినుంచి మానవుడు అందుకుంటాడు. ఇప్పటికీ చైనా, భారత దేశాల్లోని కొన్ని ప్రాంతాలలో దీనిని వినోదం కోసం ఉపయోగిస్తున్నారు.





# సత్సంకల్పములే మానవునికి ప్రధానమైన ఆస్తి

సత్సంకల్పములే మానవునికి ప్రధానమైన ఆస్తి. ఈ సత్సంకల్పములు సామాన్యమైనటువంటివి కావు. ఇవి చాలా బలమైనటువంటివి, చాలా పవిత్రమైనటువంటివి, దివ్యమైనటువంటివి, భవ్యమైనటువంటివి, నవ్యమైనటువంటివి. వీటిని మనం ఏ విధంగా ఉపయోగించుకుంటే ఆ విధమైన ఫలితములు అందిస్తూ ఉంటాయి. ఇలాంటి సత్సంకల్పములు సత్సంగమం చేత అభివృద్ధి నొందుతూ ఉంటాయి. ఈ సత్సంగమం చేత తనకు పూర్వం ఉన్న దుష్టసంకల్పములు దూరమవుతాయి. ఎట్టి పరిస్థితులలో మానవునియందు ఈ సత్సంకల్పములు ఉండిన యెడల అతని జీవితం దివ్యమైన జీవితంగా ఉంటుంది. కనుక ప్రతి మానవుడు ఈ సత్సంకల్పములనే టటువంటి వాటిని విచారించి, వాటి విషయములను గుర్తించుకొని వర్తించుట అత్యవసరం.

## సత్సంగమం

పూర్వం రత్నకారుడు అనే ఒక హంతకుడు ఉండేవాడు. అతడు దారిదోపిడీ చేసేవాడు. బాటసారుల ధనమును దోచుకొని తన కుటుంబమును పోషించుకునేవాడు. అట్టి రత్నకారుడు సప్తఋషుల సంపర్కంచేత తన దుర్భావనలు, దుశ్చింతనలను దూరం చేసుకొని ఆదికవి వాల్మీకిగా మారాడు. బుద్ధుని కాలంలో అంగుళీకరుడు అనే మహా దుర్మార్గుడు ఉండేవాడు. ఇతనుకూడా రత్నకారుడువలె దారి దోపిడీచేసి జీవించేవాడు. ఇతడు బుద్ధుని సంపర్కముచేత సాధువుగా మారిపోయాడు. జాగాలి, మాదాలి అనే తెగకు చెందినవారు ఉండేవారు. వీరు క్రూరకృత్యములు చేసి జీవించేవారు. వీరు చైతన్యుని సంపర్కంచేత పరమ భక్తులైనారు. ఈ విధంగా యుగయుగాలలో సత్పురుషుల సంపర్కంచేత వారియందున్న దుర్భావములను, దురాలోచనలను దూరం గావించుకొని, సద్భావములను, సచ్చింతనలను అభివృద్ధి పరచుకొని దివ్యమానవులుగా రూపొందారు. ఈ సత్సంకల్పములకు మూలం సత్సంగమం యొక్క ప్రభావమే.

**శ్రీ సత్యసాయిబాబా**

## మనస్సు

మనస్సు అనగా కేవలం తెల్లకాగితం వంటిది మాత్రమే కాదు. అనేక జన్మల సంస్కారములను, కర్మముల యొక్క ముద్రలను కూడుకొని ఉంటుంది. ఇది ఆత్మ యొక్క ప్రతిబింబం. ఇది మానవునికి ప్రధానమైన ఆస్తి. ఇట్టి ఆత్మతత్వాన్ని గుర్తించడం చాలా కష్టం. ఆత్మ + మనస్సు = మానవ. మనిషి – మనస్సు = ఆత్మ. కనుక మనసే ఈ రెంటికీ మూలకారణం. ఈ రెంటికీ మాత్రమే కాదు, సృష్టికే మూలకారణం మనస్సు.

మనసుకు దాసుడై
మనుజు మాత్రుండెవ్వండును
శాంతిసౌఖ్యముల్ కనుగొనలేడు
కనిపించుచున్నది స్వప్నమందున

ఇంద్రియములతో కూడిన ఈ పాంచభౌతిక శరీరము మనస్సుకంటే వేరుకాదు. మనస్సు తన యొక్క

విలాసార్థమై ఏర్పర్చుకున్న భావమే ఈ శరీరము. ఈ శరీరం మనసుకు కవచం వంటిది. ప్రతి దేహమునకు ఈ మనసే ఆధారం, మనసే కారణం. మనసే లోక వ్యవహారములకు, కార్యకలాపములకు, విలాసములకు మూలాధారం. ఉపాధ్యాయులులేని బడి, దేవుడులేని గుడి, కరెంట్ లేని వైరు, నీరులేని పైరు ఏ విధంగా నిరర్థకమో మనసులేని మానవత్వం కూడా మరణించిన జీవితమే. కనుక ఇట్టి మనస్సుతో కూడిన మానవత్వమును, దివ్యత్వముగా మార్చుకొనవలెననిన మానవ ప్రయత్నం కూడా అత్యవసరం. సర్వసామాన్యంగా మానవుడు తన శరీరమునందు మనసు బంధించబడినట్లు భావిస్తూంటాడు. కనుకనే ఈ పాంచభౌతికమైన శరీరముయొక్క క్షేమమునకై తన కాలమును వినియోగపరచుకుంటున్నాడు. దేహమే సత్యమని, నిత్యమని విశ్వసించి దాని నిమిత్తమై అనేక ప్రయత్నములు జరుపుతున్నాడు. కేవలం అన్నమయ ప్రాణమునే ఆశ్రయించి తన జీవితమును నిరర్థకం చేసుకుంటున్నారు. బుద్ధి అను విజ్ఞానమయమును ఆశ్రయించి, ఆవిజ్ఞానమయముచేత మనోమయమును జయించినవాడే విజ్ఞుడు కాగలడు. అతనే ప్రజ్ఞానవంతుడు. ఈ ప్రజ్ఞాన తత్వమనేటటువంటిది సత్సంకల్పముల చేతనే ఏర్పడుతుంది.

## భక్తి - సత్సంకల్పం

భగవంతునిమీద భక్తి, విశ్వాసములతోపాటు సత్సంకల్పములు కూడా చేరినప్పుడే అతని జీవితంలో గొప్ప మార్పు వస్తుంది. తమిళనాడులో 50 సం॥లకు పూర్వం ఒక బీద బ్రాహ్మణుడు వుండేవాడు. అతనికి ఒక కుమారుడు కలిగాడు. తల్లి తన కుమారునికి ప్రతినిత్యము మహాత్మా గాంధీని గురించి చెబుతుండేది. గాంధీజీ లాయర్ అయి కూడా బీదవారి బాధల కోసం, దేశ స్వాతంత్ర్యం కోసం ఏవిధంగా పోరాటం కొనసాగిస్తున్నది చెప్పేది ఆ తల్లి. ఆ పసి హృదయం మీద గాంధీజీ ప్రభావం పడింది. ఆ తల్లి మాటలు స్మరిస్తూ పట్టుదలతో వీధి దీపాల క్రింద కూర్చొని చదివేవాడు. టీ త్రాగటానికి కూడా అతని వద్ద పైసా కూడా వుండేది కాదు. కులాయినీళ్ళు త్రాగి పొట్ట నింపుకొని పట్టుదలతో చదువుతుండేవాడు. అతనికి భగవంతుని మీద విశ్వాసం, భక్తి ఉండేది. కష్టములు యిచ్చినా, సుఖములు యిచ్చినా భగవంతుడు నా మంచి కోసమే యిస్తాడని అతను భావించేవాడు. పరీక్షలు ప్యాసయి న్యాయవాద వృత్తిని స్వీకరించాడు. అయినప్పటికి పేదరికం అతనిని వదలలేదు. అతని దీన పరిస్థితినిచూచి ఎవరైనా మిత్రులు 'భగవంతునికి దయలేదా!' అని అంటే 'God will help everything for our own good' అని సమాధానము చెప్పేవాడు. అతని పేరు ముత్తుస్వామి అయ్యర్ ! స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మద్రాసు హైకోర్టుకు ప్రధాన న్యాయమూర్తి అయినాడు. ఎన్ని కష్టములు వచ్చినా భక్తిశ్రద్ధలతో భగవంతుని ఆరాధించేవాడు కాబట్టే అతనికి ఉన్నత పదవి లభించింది. ఇంగ్లండులో ఒక కుర్రవాడు చదువురానివారికి ఉత్తరాలు వ్రాసిపెట్టడం, కవర్లమీద అడ్రసులు వ్రాసియిచ్చి వారు ఎంత యిస్తే అంత తీసుకొని పొట్టపోసుకునేవాడు. ఉత్తరాలు వ్రాసి వారికి యిచ్చే సమయంలో "దైవము నిన్ను ఆశీర్వదించుగాక !" అని అనేవాడు. ఇండ్లకు వెళ్ళి పిల్లలకు ట్యూషన్లు చెప్పేవాడు. తిరిగి వెళ్ళేటప్పుడు "God Bless You" అని చెప్పేవాడు. భవిష్యత్తులో నాచేత ఉన్నతములైన మంచి పనులు భగవంతుడు చేయిస్తాడనే నమ్మకం అయనలో వుండేది. ప్రతివారికి 'Trust you God' అని చెప్పేవాడు. అతనే "జెమ్స్ నిట్టోనాల్" ఒకప్పటి బ్రిటీష్ ప్రధానమంత్రి. దైవమునందు భక్తి విశ్వాసములతోపాటు, మనిషిలో సత్సంకల్పములు చేరినప్పుడే మానవుడు విజయాన్ని సాధించి తీరతాడనే విషయం పై ఇరువురి జీవితాలు ఋజువు చేస్తున్నాయి. మానవుడు సత్సంకల్పముచేత విశ్వాసాన్ని తనవశం చేసుకోగలడు.

## ఇచ్ఛాశక్తి [ WILL POWER ]

ఈ ఇచ్ఛాశక్తి [Will Power] అన్ని ఇచ్ఛలలోను, అన్ని ఆశలలోను రాజువంటిది. ఈ ఇచ్ఛాశక్తి పెరగ

వలెననిన మనం ఏంచేయాలి ? కోరికలు తగ్గించుకోవాలి. కోరికలను అదుపులో పెట్టుకున్నప్పుడు, ఆ కోరికలపై ప్రవేశిస్తున్న శక్తి, ఇచ్ఛాశక్తిలో లీనమైపోతుంది. అప్పుడు ఇచ్ఛాశక్తి బలపడుతుంది. ఈ విధముగా ఇచ్ఛాశక్తిని పెంచుకుంటే ఇంద్రుడిగా మారవచ్చును. దేనినైనా సాధించవచ్చును. సర్వ విజయములకూ ఈ ఇచ్ఛాశక్తే కారణం. దీనిలోని రహస్యాన్ని గుర్తించిన ప్రాచీనులు, వైరాగ్యం పేరుతో తమ కోరికలను అదుపులో పెట్టుకున్నారు. కోరికలు ఎంత తగ్గితే ఇచ్ఛాశక్తి అంత పెరుగుతుంది. ఈ ఇచ్ఛాశక్తిని మనం దైవం వైపు మరల్చాలి. వ్యక్తి మంచి బలశాలి అయినప్పటికీ అతను చేయు పనియందు నైపుణ్యం లేనియెడల, అతని బలం నిరుపయోగమవుతుంది. మనిషిలో బలం లేకపోయినా, పనిముట్టు వుండవలసిన రీతిలో ఉండకపోయినా తాను ఆశించినపని చేయలేడు. అదేవిధముగా ఇచ్ఛాశక్తి చాలా బలవత్తరమైనది అయినప్పటికీ, తనయొక్క భావములు భగవద్భావములుగా మారకున్నచో, ఈ ఇచ్ఛాశక్తి నిరుపయోగమైపోతుంది. కనుక మన ఇచ్ఛాశక్తితో పాటు క్రియాశక్తిని, క్రియాశక్తితోపాటు జ్ఞానశక్తిని మనం పోషించుకోవాలి. ఈ విధమైన రీతిలో సత్సంకల్పములను అభివృద్ధిపరచుకొనినచో సాధించలేనటువంటిది అంటూ ఈ లోకంలో ఏదీ వుండదు. సర్వమునూ సాధించవచ్చును. కనుక మనయందున్న ఇచ్ఛాశక్తిని సత్సంకల్పములుగా మార్చుకోవాలి. మనిషి చచ్చినప్పటికీ సంకల్పములు చచ్చేవి కావు. కనుక సంకల్పములు సత్సంకల్పములు సక్రమమైనవిగాక ఎన్నివిధములైన సాధనములు చేసినప్పటికీ నిరుపయోగమవుతాయి. దీనితోపాటు భగవత్ విశ్వాసం అత్యవసరం.

## భగవద్విశ్వాసం

ఈ భగవద్విశ్వాసం కూడా ఎన్ని గ్రంథములు చదివినప్పటికి, గీతాసారం తెలుసుకొనినప్పటికీ, బ్రహ్మసూత్రములు మ్రింగినప్పటికీ, జపధ్యానములు జరిపినప్పటికీ ఏమాత్రం ప్రయోజనం లేదు. ఇవి కేవలం దేహంతో

## వందనం...

వందనం... అభివందనం
సత్యసాయికి వందనం... అభివందనం

గ్రామసేవే రామసేవని
వేదసారం విప్పిజెప్పి
మానవునిలో మాధవుని చూపిన
వేదమూర్తికి వందనం...

ప్రేమతత్వం ప్రబోధించి
మమత సమతలు పొందుపరచి
మానవత్వం విలువ తెలిపిన
ప్రేమమూర్తికి వందనం...

భక్తిమార్గం బోధచేసి
రక్తిలోని మాయతెలిపి
శిష్యకోటికి దారిచూపిన
సనాతన సారధికి వందనం...

మోక్షమంటే వేరులేదని
సేవద్వారా పొందవచ్చని
ముక్తిమార్గం చూపిన
పురాణ పురుషునికి వందనం...

ఆర్తునకు అన్నార్తునకు
యోగికి మరి భోగికి
జ్ఞానమార్గం చూపిన
జ్ఞానదేవునికి వందనం...

కూటికోసం విద్యకాదని
ప్రజ్ఞకోసం చదువుకోమని
చదువు మర్మం ఎరుకపరచిన
గురుదేవులకు వందనం...

— కొమరగిరి

ఆచరించే Exercise లాంటివే అవుతాయి. ఈ Physical Exercise వలన కొంత దేహభ్రాంతి కూడా అధికం కావచ్చును. కనుక ఈ దేహంతో పాటు మనయందు ఉండిన భావములను పరిశుద్ధం గావించుకోవాలి. ఇది కేవలం ఒక భగవత్ ఇచ్ఛతో తప్ప మరొకదానితో ఇవి శుభ్రం కావు.

నమ్మకమను రెండు నయనమ్ములే లేని
అంధులైన మనుజు లవనియందు
తాను చూడనియున్న దైవమ్ములేడకో
తనకు లేదుగాని మనకు లేదా !

మనం విశ్వాసాన్ని అభివృద్ధిపరచుకోవాలి. దైవము నందు విశ్వాసాన్ని ఉంచాలి. దైవమే లేకుండినచో ఈ ప్రకృతి యొక్క చిత్ర విచిత్రమంతయున్నూ ఎవరు చేయగలుగుతున్నారు ? మానవాతీతమైన దివ్య అనుభూతులు ఎవరందిస్తున్నారు ? " తెరచాటు తానుండి తెర ముందు ప్రజనుంచి తాను అన్ని ఆడిస్తున్నాడు " అనే విషయం విస్మరించరాదు.

## గురుపూర్ణిమ

నేడు గురుపూర్ణిమ. దీని ప్రాముఖ్యతను గోకాక్ చక్కగా అర్థమయ్యే రీతిలో మీకు వివరించారు. ఏవో కొన్ని గ్రంథములవలననో, ఉపదేశములవలననో, మానవునియందు ఉండే అజ్ఞానమనే అంధకారమును దూరం చేసుకొని ప్రజ్ఞానమనే ప్రకాశమను జ్యోతిని వెలిగించుకుంటాం. అయితే ఏదో ఒక గురువును ఆధారంగా చేసుకొని అతని శుభోధనలచేత మనం ఉన్నతస్థాయికి చేరుతామని విశ్వాసం భారతీయులది. ఇక్కడ గురువులు అనేకమంది ఉంటున్నారు. శాస్త్రసమ్మతమైన గురువులు ఎనిమిది మంది. 1. బోధగురువు, 2. వేదగురువు 3. నిషిద్ధగురువు, 4. కామ్యగురువు, 5. వాచక గురువు, 6. సూచకగురువు, 7. కారణగురువు, 8. విహితగురువు.

## గురువులు

బోధ గురువు కేవలం శాస్త్రార్థమును మాత్రమే బోధించి, వాని నిబంధనలు తగిన రీతిగా ఆచరించడానికి ప్రోత్సాహం, ఉత్సాహం యిచ్చేవాడు. వేదగురువు తత్త్వార్థమును బోధించి, తత్త్వ దర్శనముగావించి, మన మనస్సును దైవము వైపుకు మరల్చేటటువంటివాడు. విహితగురువు అనేకవిధములైన సందేహములను రూపుమాపి, మనస్సును పరిశుద్ధంగావించి, చిత్తశుద్ధిచేత తన ఆత్మతత్వాన్ని గుర్తించుకొనేటట్లుగ చేయువాడు. నిషిద్ధ గురువు కొన్ని కామ్య కర్మలను బోధించి, ఇహపరముల యందు బోధను అందించేటటువంటివాడు. కామ్యగురువు పుణ్య కార్యములను ఆచరింపజేయించి, తద్వారా ఇహ పరములయందు సుఖమును అందించేటటువంటివాడు. సూచిక గురువు శమదమాది సత్సంపత్తిని బోధించి మానవుని యొక్క ఇంద్రియాలను నిగ్రహింపజేసేటటు వంటివాడు. వాచికగురువు యోగతత్వమును బోధించి దివ్యత్వమైనటువంటి ఆత్మతత్వాన్ని అనుభవింపజేసేటటు వంటివాడు. కారణగురువు జీవబ్రహ్మ ఐక్యానుసంధానమును కలిగింపజేసేటటువంటివాడు. కనుక కారణగురువే ప్రధానమైనటువంటి గురువు. ఈతను జీవతత్వాన్ని దైవతత్వంగా మార్చగలిగేటటువంటివాడు. ఈ రెంటి యొక్క సంబంధములే ప్రతిబింబముల యొక్క సంబంధములని బోధించేటటువంటివాడు. జీవునకు దేవునకు భేదములేదని నిరూపించేటటువంటివాడు. ఆచరణరూపమైన బోధనలు సలిపేటటువంటివాడు. ప్రత్యక్ష ప్రమాణములను నిరూపించేటటువంటివాడు. ఈ గురువు ఒక్క దైవము మాత్రమే.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః

అతనే బ్రహ్మ విష్ణువు మహేశ్వరులుగా భావించుకోవాలని నిరూపిస్తూ వచ్చేటటువంటివారు, లోక సంబంధమైన చదువులు చెప్పేవారు మాత్రం ఉపాధ్యాయులు మాత్రమేగాని గురువులని చెప్పడానికి వీలుకాదు. ఇలాంటి గురువులను (ఉపాధ్యాయులను) ఆశ్రయించి మనయొక్క సత్వరూపాన్ని అందుకోలేం, అనుభవించలేము. అందులో ఈనాడు మరింత విచిత్రమైన గురువులు తయారవుతున్నారు. "చెవులో మంత్రం చెప్పడం, చేతితో డబ్బు తీసుకోవడం" ఈ మంత్రం యొక్క వ్యాపారంతో ఈనాడు మునిగిపోయినారు గురువులు. మంత్రముల చేతగాని, తంత్రములచేతగాని ఏమాత్రం మనకు దివ్యత్వం ప్రాప్తించదు. మనలోని మాలిన్యాన్ని ఏనాడు పరిశుద్ధం గావించుకొందుమో, అప్పుడే పవిత్రమైనటువంటి మంత్ర ప్రభావం మనకు ప్రాప్తిస్తుంది. కనుకనే "చిత్తశుద్ధియే కర్మః" మన కర్మలన్నీ ఇప్పుడు చిత్తశుద్ధిగావించుకొను నిమిత్తమై ఈనాడు ఆచరించవలసినదే. ఈ విశ్వాసంతో మనం నిత్యజీవితాన్ని గడపాలి. ఏమి చూచినా, ఏది విన్నా ఏది చెప్పినా, భగవద్విశ్వాసంతోనే వినాలి, చేయాలి, చూడాలి. "సర్వం విష్ణుమయం జగత్, సర్వం సంకల్పమయం, విష్ణుమయం". కనుక విష్ణువునకు సంకల్పమునకు భేదంలేదు. ఈ సంకల్ప స్వరూపమే విష్ణుస్వరూపం.

### శాంతి

విష్ణువు కేవలం గదాధారి మాత్రమే కాదు. సర్వత్రా వ్యాపించినటువంటి చైతన్యశక్తియే విష్ణువు. కేవలం లౌకికమైన పురాణములచేత మనం లౌకికమైనటువంటి వాంఛలను విశ్వసించి, లౌకికమైన భావములనే విశ్వసించి లౌకికమునందే మునిగిపోతున్నాం. అందరియందు దైవత్వం ఉంటుండాలి. అది లేనటువంటి జీవితమే లేదు, దేహమే లేదు. కనుక సర్వులయందు కూడను దైవమున్నాడనే విశ్వాసమును అభివృద్ధిపరచుకోవాలి. ఎవరిని హింసించినా, ఎవరిని బాధించినా, ఎవరికి నొప్పి కలిగించినా అది దైవానికే కలిగించినట్లుగా మనం విశ్వసించాలి. ఈ జగత్తులో మనకు శాంతి ఉందని భావిస్తున్నాం. శాంతి జగత్తులో లేదు. శాంతి నీయందే ఉంటుంది. ఉదాహరణకు మనం ఎక్కడైనా ఒక పట్టణమునకు క్యాంపు వేస్తాం. మనం ఏ ఆహారాన్ని భుజిస్తామో ఆ ఆహారానికి చెందిన హోటల్‌కు సహజంగా వెళ్ళుతాం. శాఖాహారులు, బోర్డు చూడకుండా మిలటరీ హోటల్‌కు వెళ్ళి "సాంబారు, రసం తీసుకొనిరా!" అంటే "ఇక్కడ లేదు. ప్రక్క హోటల్‌కు వెళ్ళమంటాడు." బోర్డు చూడకుండా ప్రవేశించడమే దీనికి కారణం. ఈ ప్రపంచం ముందున్న బోర్డును చూడకుండా ఈ ప్రపంచంలో ప్రవేశించి "శాంతి, శాంతి, శాంతి" అని అడుగుతున్నారు. ఎవరు వడ్డిస్తారు. ఆ బోర్డు ఎక్కడ ఉంది ?. "అయస్వం అసుఖం లోకం" ఇంకెక్కడ శాంతి ఉన్నది. శాంతి లేనిది ఈ జగత్తు అని బోర్డు వుండాలి. ఆ బోర్డును చూచి ఉంటే ప్రపంచంలో శాంతి కావాలని ఎవరైనా కోరుతారా ? అయితే ఈ శాంతి ఎక్కడ ఉంటుంది. తనయందే ఉంటుంది. తనయందు ఉంటున్న శాంతిని తాను మరచి, జగత్తులో వెదకటానికి ప్రయత్నిస్తే ఇది దొరికేటటువంటిది కాదు. శాంతికి కర్త, భర్త దైవమే. కనుక అతనిని ఆశ్రయించినప్పుడే మనకు శాంతి లభిస్తుంది. అతనిని ఆశ్రయించక మనం "శాంతి శాంతి" అంటే మనకు శాంతి లభించదు. కనుక శాంతి [Peace] ఏవిధంగా వస్తుంది. ఈ జగత్తు అంతా ముక్కలే [Pieces]. There is no Peace.

"హస్తమున అణుబాంబు ఉంచుక
అరుస్తుందురు శాంతి శాంతని"

చేతిలో ఉందేది అటంబాంబు. అడిగేది శాంతి శాంతని. ఎక్కడ వస్తుంది ? ఎప్పుడు ఈ అటంబాంబును దూరం చేస్తామో, అప్పుడే శాంతి లభిస్తుంది. కనుక జగత్తు భావం దూరం చేసినప్పుడే దైవభావం మనలో ప్రవేశించినప్పుడే శాంతి మనకు లభిస్తుంది. ఈ విశ్వాసాన్ని మనం ఈనాడు పెంచుకోవాలి. ఈ విశ్వాసాన్ని మనం ఈనాడు చాటాలి.

## దేవుడున్నాడు

ఈ గురుపూర్ణిమ రోజున ఏ అష్టాక్షర నామాన్ని నేను ఉపదేశించదలచలేదు. ఏ ఉపనిషత్తునో, ఏ భగవద్గీతనో, ఏ బ్రహ్మ సూత్రాలనో చదువమని నేను బోధించడంలేదు. ఈ పంచాక్షరినామం అందరికి వచ్చి వుండాలి. "దేవుడున్నాడు". ఈ ఐదు అక్షరాల నామాన్నే మీరు ప్రధానంగా తీసుకోండి. మనం నిరంతరం చింతిస్తూ, భావిస్తూ, ఆచరిస్తూ, ఆనందిస్తూ, అందిస్తూవుంటే ఇంతకన్నా లోకకళ్యాణం మరొకటిలేదు. (అని బాబాగారు సందేశమిస్తూ ఈ క్రింది పాటను వేలాది భక్తులచేత సంకీర్తన చేయించారు).

ఉన్నాడయా ! దేవుడున్నాడయా !
కన్నులకు కనిపించకున్నాడయా !
లోకాల చీకట్లు పోకార్ప
రవిచంద్రు దీపాలు గగనాన త్రిప్పుచున్నాడయా!
లక్షలాదిగ నున్న నక్షత్రముల నెల్ల
నేలరాల్పక మింట నిల్పుచున్నాడయా !
ఈ ధారుణీ చక్ర మిరుసు లేకుండగా
ఎల్లవేళల త్రిప్పుచున్నాడయా !
జీతభత్యములు లేక ప్రీతితో మనకొరకు
గాలితో సురటీలు విసరేనయా !
ఆధారమేలేక అలరారుచున్నట్టి
ఆకాశమును ఆపుచున్నాడయా !
పొంగిపొరలచు వచ్చి పృధ్విపై పడకుండ
కడలిరాజును కాలు ముడిచాడయా !
కనిపించక ఏమిచేస్తున్నాడయా !
తెరచాటు తానుండి తెరముందు ప్రజనుంచి
తైతిక్కలాడించుచున్నాడయా !

ఈ మంత్రాన్ని మీరు ఈనాటి ఉపదేశంగా భావించి, ఎక్కడికి పోయినా, ఎలాంటి పరిస్థితులందైనా ఉన్నాడు! ఉన్నాడు ! అని బల్లగుద్ది చాటాలి. ఈ విశ్వాసాన్ని మీరు బలపరచుకుంటే లోకం నిత్యకళ్యాణం, పచ్చతోరణాలతో కిలకిలలాడుతూ కళకళలాడుతూ వుంటుంది. ఈ విధమైనటువంటి ప్రచారంచేత "పాపభీతి దైవప్రీతి"ని మనం అభివృద్ధిపరచుకుంటాం. ఎలాంటి సమస్యలు వచ్చినప్పటికీ ఎదుర్కొనే ధైర్యసాహసం ఈ "ఉన్నాడయా !" అనే విశ్వాసమే బ్రహ్మాస్త్రంగా మారుతుంది. ఏ రామ మంత్రంకంటే, ఏ కృష్ణ మంత్రంకంటే, ఏ శివ మంత్రంకంటే "ఉన్నాడు !" అను మంత్రమే చాలా బలమైన మంత్రం. అది లేకుండా ఎన్ని మంత్రములు చెప్పినప్పటికీ ప్రయోజనం లేదు. మంత్రశక్తికంటే యంత్రశక్తి, యంత్రశక్తికంటే చిత్తశక్తి చాలా ప్రధానమైనది. ఇది హృదయం నుండి ఆవిర్భవించాలి. అక్కడే ఉన్నాడు దైవం. భగవద్గీతలో భగవంతుడు దేహంలో ఎక్కడ ఉన్నాడనే సత్యాన్ని చక్కగా నిరూపిస్తూ వచ్చారు.

"అహం వైశ్వానరో భూత్వా
ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః
పచామ్యన్నం చతుర్విధమ్"

ఈ దేహాన్ని ఆశ్రయించి నేను వైశ్వానరుడుగా ఈ యొక్క ఉదరంలోనే ఉంటున్నానన్నాడు. కనుకనే ఈ కడుపునకు ఎట్టి పదార్థం వేస్తామో, ఆ పదార్థమును జీర్ణించి సర్వాంగములకు అదే సప్లయి చేస్తుంది. కనుక చెడ్డ భావములున్న పదార్థములు నీయొక్క జఠరాగ్నికి అందిస్తే, చెడ్డ ఫలితమే నీకు అందిస్తుంది. పవిత్రములైన భావములున్న పదార్థములను నీ జఠరాగ్నికి అందిస్తే, పవిత్రమైన ఫలితమే నీకు లభిస్తుంది.

## సంకల్పములే మూలం

అదృష్టమునకు దురదృష్టమునకు మన సంకల్పములే మూలకారణం. సంకల్పములనే బీజములనుండి కర్మలనే ఫలితములు ఉద్భవిస్తున్నాయి. కర్మలనే బీజముల నుండి అభ్యాసములనే ఫలములు లభిస్తున్నాయి. అభ్యాసములు అనే బీజములనుండి శీలం అనే ఫలములు లభిస్తున్నాయి.

శీలం అనే బీజము నుండి అదృష్టం అనే ఫలములు లభిస్తున్నాయి. కనుక మనయొక్క అదృష్టమునకు శీలముఅనే బీజము ఆధారము శీలం అనే ఫలమునకు మన అభ్యాసమే ఆధారము. ఈ అభ్యాసమునకు కర్మయే ఆధారం. ఈ కర్మమునకు సంకల్పమే మూలం కనుక మన అదృష్టం, దురదృష్టం మన సంకల్పంపైనే ఆధారపడి ఉన్నది. కనుక మన సంకల్పములను సరైనరీతిలో అభివృద్ధిపరచుకోవాలి. సంకల్పముయొక్క శాసనాన్ని చక్కగా గుర్తించడానికి ప్రయత్నించాలి. దాని పనులను విశాలమైన హృదయంతో విచారించాలి. సంకల్పములు వచ్చిన తక్షణమే మనం క్రియా రూపాన్ని ధరించడం మంచిది కాదు. ఇది మంచిదా ? చెడ్డదా ? ఇది చేయదగినదా ? చేయదగనిదా ? అనేటువంటి విచారణ జరపాలి. దీనివలన సమాజమునకుగాని, నాకుగాని మంచి కలుగుతుందా ? లేక హాని కలుగుతుందా ? అని కూడను విచారించాలి. మన అదృష్టం దురదృష్టం మన సంకల్పంపైననే ఆధారపడినదిగాని ఇతరులు దీనికి కర్తలు కాదు. మన సుఖమునకు దుఃఖమునకు మన సంకల్పమే కారణం. కనుక సత్సంకల్పములను అలవరచుకొనిన మానవుడే ఈ జగత్తునందు సత్యసర్వేశ్వరత్వాన్ని అనుభవించడానికి అధికారి అవుతాడు. ఇట్టి దివ్యత్వమైనటువంటి విశ్వాసాన్ని బలపరచుకునే నిమిత్తమై "దేవుడున్నాడు" అనే పంచాక్షర నామాన్ని నిరంతరం పఠించు.

## ఆత్మ విశ్వాసం

ఉన్నాడయా ! దేవుడున్నాడయా ! అనే మంత్రాన్ని నిరంతరం ఉచ్చరించాలి. "బ్రహ్మవిష్ణుమయం భవతి" బ్రహ్మతత్వాన్ని ఎరిగినవాడు బ్రహ్మగా మారిపోతాడు. "ఉన్నాడు, ఉన్నాడు" అంటే తాదాప్య భావాన్ని పొంది ఉండే, ఉండి సాక్షాత్కారాన్ని అందిస్తాడు. ఈ విశ్వాసమునకు ఎన్ని అంతరాయములు కలిగినప్పటికినీ, ఘనం వెనుకంజ వేయక ముందంజ వేస్తూ పోవాలి. దీని వల్ల మనం నిజమైనటువంటి ఆత్మశక్తిని సాధిస్తాం. ఆనందాన్ని అనుభవిస్తాం. ఉన్నాడో ! లేదో ! ఈ సంశయంతో జీవితాన్ని నాశనం చేసుకోకూడదు. ఈ సంశయం ఉన్నటువంటివాడు అధముడై పోతాడు. దేనికైనా శక్తి అవసరం. ధైర్యసాహసములకు ఒకవిధమైన నమ్మకం ఉండాలి. నమ్మకంతోనే జీవితాన్ని గడపాలి. చిన్న చిన్న విషయాలలో సహితం ఎంతో విశ్వాసంగా ఉండటం వలననే కార్యాలను సాధించగలుగుతాం. కనుక విశ్వాసమే మన శ్వాసగా భావించాలి. విశ్వాసం లేని జీవితం శ్వాసలేని జీవితమే. అన్ని విశ్వాసములకంటే ఆత్మ విశ్వాసం చాలా గొప్పది. ఇట్టి ఆత్మవిశ్వాసంతో మనం ముందంజ వేయాలి. కనుక ఈనాటినుండి మీరు ఈ దైవ విశ్వాసాన్ని అభివృద్ధిపరచుకొని సమాజసేవలలో పాల్గొని, తోటి మానవుల బాధలను పంచుకొని సమాజసేవకు మన జీవితం అంకితం గావించుకోవాలి. ఎవరికి సేవ చేస్తున్నా దైవానికే సేవ చేస్తున్నానని భావించండి.

(ది. 21-7-1986 గురుపూర్ణిమ రోజున భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారు ప్రశాంతి నిలయంలో యిచ్చిన ఉపన్యాసము.) ★

నా అనుభవం, అనుభూతి

# ప్రశాంతి నిలయంలో...

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారిని సందర్శించాలని ది 18-7-1986 న, నా శ్రీమతితో సహా ప్రయాణం అయ్యాను. అనారోగ్య కారణాల వలన 18 గంటలు బస్సులో ప్రయాణం చేయడం కష్టమేమోనని మొదట్లో నా శ్రీమతి భావించింది. ఏమైనా వెళ్ళి తీరాలని, బాబాగార్ని సందర్శించి, వారి ఆశీస్సులను పొందాలని నిశ్చయించుకొని మేమిరువురం బయలుదేరాం. 19 వ తేది ఉదయం 7 గంటలకు ప్రశాంతి నిలయంలో అడుగు పెట్టాం. గురుపూర్ణిమ మహోత్సవాలు కావడం వలన సహజంగా వేలాది మంది భక్తులు రావడం పరిపాటి. కాటేజీలు దొరకడం కష్టమని మాతోపాటు బందరునుండి వచ్చిన శ్రీ జ్ఞానేశ్వర శర్మగారు చెప్పారు. హాల్సులో వసతి చూపిస్తారనికూడా

కొమరగిరి కృష్ణమోహనరావు

చెప్పారు. మా బావగారు శ్రీ ఆర్. లక్ష్మీకాంతరావుగారికి ఒక క్వార్టర్ అక్కడ ఉన్నది. అక్కడేమైనా అవకాశం ఉంటుందేమోనని భావించి సామానులతోసహా అక్కడికి వెళ్ళాం. తాళంవేసి ఉంది. బాబాగారు బయటకువచ్చే సమయం కావడం వలన సామానులు వరండాలోపెట్టి బాబాగారిని చూడటానికి వెళ్ళాం. దూరంగా ఉండి వారిని దర్శించుకున్నాం. తిరిగి వచ్చేటప్పటికి క్వార్టర్ తెరిచి ఉంది. కాలకృత్యాలు ముగించుకొని భక్తులు సంకీర్తన చేస్తున్న చోటికి వెళ్ళి కూర్చున్నాం. బాబాగారు మరల బయటకువచ్చి బారులు తీర్చి కూర్చొని భక్తితో సంకీర్తనం చేస్తున్న భక్తులను పరామర్శిస్తున్నారు. నేను కూర్చొనిన ప్రదేశానికి బాబాగారు వచ్చారు. నేను కొంచెం దూరంగానే కూర్చున్నాను. భక్తులందరితో పాటు నేనూ నమస్కరించాను. వారి దృష్టి ఊహించని రీతిలో నా మీద పడింది. వెంటనే నా పేరు పెట్టి “ కృష్ణమోహన్ ! ఎప్పుడు వచ్చావు ? నీ గృహలక్ష్మి కూడా వచ్చింది గదా ? ” అని బాబాగారు నన్ను పలకరించారు. ‘ ఉదయమే వచ్చాం ’ అని ముక్తసరిగా సమాధానం చెప్పి కూర్చున్నాను. నా వొళ్ళు పులకరించింది. బాబాగారిని చూడటానికి ప్రశాంతి నిలయం వెళ్ళడం ఇది రెండవసారి మాత్రమే. మొదటిసారే ( విజయదశమి ముందు ) ఊహించని రీతిలో బాబాగారితో ప్రత్యేకమైన ఇంటర్వ్యూ నాకు లభించింది. అయినప్పటికి ఇప్పుడు నన్ను గుర్తించి పేరుపెట్టి పిలవడం నన్ను ఆశ్చర్యచకితుని గావించింది. అన్ని వేలమందిలో ఈ విధంగా ( బాగా పరిచయం ఉన్నట్లుగ ) నన్ను గుర్తించడం [illegible]నవమాత్రులకు సాధ్యమయ్యే విషయం మాత్రం కాదు.

సంకీర్తన అయిన తరువాత ఎంక్వయిరీ ఆఫీసుకు వెళ్ళాను. నా పరిచయం చేసుకున్నాను. నా పేర క్వార్టర్ రిజర్వు అయివున్నదని చెప్పి తాళంచేతులు యిచ్చా[illegible]బ్బు ఏమైనా చెల్లించాలా ? అని అడిగాను. అవసర[illegible]న్నారు. తరువాత శ్రీ కు టుం బ రా వు ( మేనేజర్ ) గారిని కలిసి పరిచయం చేసుకున్నాను తాళం చేతులు తీసుకున్నారా? అంటూ “ మీరు వచ్చారా ? ” అని బాబాగారు ఉదయమే అడిగారు అని వారు చెప్పారు. నాకు ఎంతో ఆశ్చర్యం వేసింది. సామాన్లు తెచ్చుకొని క్వార్టర్‌లో చేరాం. సా యం త్ర ం ముందువరుసలో కూర్చున్నాను బాబాగారు వచ్చి నన్ను ఆశీర్వదిస్తూ విభూది సృష్టించి ఇచ్చారు. 20 వ తేది ఉదయం వరుసలో కూర్చున్నాను. నన్ను చూచి ఉండు ! అంటూ వెళ్ళిపోయారు. 20 వ తేది సాయంత్రం బాబాగారు వచ్చే దోవకు దూరంగా ఎక్కడో మధ్యలో కూర్చున్నాను. భక్తులను పరామర్శిస్తూ మెయిన్ గేటు దగ్గరకు వెళ్ళి శ్రీ కుటుంబరావుగారికి నన్ను చూపిస్తూ, ఏదో చెప్పి వెళ్ళిపోయారు. సంకీర్తన తరువాత శ్రీ కుటుంబరావుగారు నన్ను పిలిచి, రేపు ఉదయం గం. 7-15 ని॥కు మందిరంలో వివిధ రాష్ట్రీ సాయిసేవా శాఖల అధ్యక్షుల

( తరువాయి 49వ పేజీలో )

## “ ఇదీ విషయం - ” ముగించింది డాక్టరు.

మధుమూర్తి – చాలా తప్పు చేసిన వాడిలా తల వొంచుకున్నాడు. ప్రక్కనున్న దయానిధిని చూడటానికి కూడా అతను జంకుతున్నాడు. అతనికి - నోరు పెగలడంలేదు.

“ మీ వల్లే మళ్ళీ ఆయన పూర్వపు మనిషి కాగలరేమో...” సూచిస్తున్నట్లంది డాక్టరు భారతి. చెడుపు పెట్టినవారే తీయాలి – అన్నట్లు ధ్వనించాయామె మాటలతనికి.




“ వారు నాకు గురువుగారు. మంచి స్నేహితులు....” అన్నాడు మధుమూర్తి ఏదో చెప్పబోతున్న...

“ అందుకే – టెలిగ్రాం అందుకోగానే వ్యాపారపనులు వొదులుకుని ” అన్నాడు దయానిధి, కృతజ్ఞతలు తెలుపుతున్నట్లు.

“ అది – నా విధి. పదండి....వారిని చూద్దాం ”.

“ ట్రాంక్విలైజర్స్ (Tranquilisers) సెడెటివ్ (Sedatives) మీదా ఉంచుతున్నాం. సిస్టర్‌ని చూసి రమ్మంటాను. ” నర్స్‌ని పిలిచి రామచంద్రమూర్తి ఏ పరిస్థితిలో ఉన్నాడో చూసి చెప్పమంది డాక్టరు.

నాలుగు నిముషాలలో ఆమె తిరిగి వొచ్చి డాక్టరుతో ఏదో చెప్పింది.

“ మీరు వెళ్ళి చూడవొచ్చు. “ అందామె.

“ ప్లీజ్ .... దయానిధిగారూ ! నేను ఒక్కడినే వెళ్తాను. ” లేచాడు మధుమూర్తి.

“ సరే. ” అన్నాడతను.

నర్స్ – మధుమూర్తిని ఆ గదిలోకి తీసుకువెళ్ళింది. ద్వారం వద్దనుంచే ఆమె మరలిపోయింది.

రామచంద్రమూర్తి – కిటికీ వద్ద నిలుచుని అవతలకు చూస్తున్నాడు.

### జ రి గి న క థ

మర్నాడు దయానిధి రామచంద్రమూర్తి ఇంటికి వెళ్ళాడు. అక్కడ రామచంద్రమూర్తి పరిస్థితి అసహ్యంగా వుంది. పాములు మీదకొస్తున్నాయని, కాష్మోరా లేస్తుందని తను సీరియల్స్ రాయనని రాత్రల్లా పిచ్చి పిచ్చిగా అరిచాడు రామచంద్రమూర్తి. డా. భారతి కలిసిందన్న విషయం చెబుదామని వచ్చిన దయానిధికి రామచంద్రమూర్తి యొక్క పరిస్థితి చూసి అతన్ని హస్పిటల్‌కి తీసుకెళ్ళాడు. డా. భారతికి ఫోన్ చేయించి ఆమెని రప్పించాడు. తనకి పరిచయం చేస్తానన్న వ్యక్తి ఇతనేనని చెప్పగానే డా. భారతి చాలా బాధ పడింది. రామచంద్రమూర్తికి ట్రీట్‌మెంట్ మొదలయింది.

( ఇ క చ ద వం డి )

మెల్లగా పిలిచాడు మధుమూర్తి! "గురువు గారు!"

అతను వెనక్కి తిరిగి చూసి - "నువ్వా!" అన్నాడు ఆశ్చర్యంగా.

"నేనే గురువుగారూ!" చిరునవ్వు నవ్వబోయాడు.

ఒక్కసారి రామచంద్రమూర్తి భయపడినట్లు అరిచాడు. "నో! నువ్వు నువ్వు కావు. అబద్ధమాడుతున్నావు. నువ్వు - నీ దెయ్యానివి. ఔను. అంతే. నువ్వు చచ్చిపోయావు. సాహిత్యోద్ధరణ సమితివాళ్ళు....నిన్ను చంపేశారు సమాజానికి హాని కలిగించే రచనలు చేస్తున్నావని."

చిరునవ్వు నవ్వాడు రామచంద్రమూర్తి భుజం మీద చేయివేస్తూ మధుమూర్తి. "నిజమే. నేను నేను కాను. నా దెయ్యాన్ని, అందుకే మీతో మాట్లాడాలని వచ్చాను గురువుగారూ! ప్లీజ్ .... నా కవకాశమూ అనుమతీ యివ్వండి కొంచెం."

"ఏం మాట్లాడతావ్?"

"నేను సాహిత్యానికి చేసిన ద్రోహం....ఇంకెవరూ చేయకూడనిది....గురువుగారూ! నన్ను హత్య చెయ్యడం న్యాయమే. ఎందుకంటే నేను నా రచనలతో సమాజాన్ని స్లోపాయిజన్ చేశాను. నా నేరం కంటె నాకు పడిన శిక్ష అతి తక్కువ.

పాఠకులకేం కావాలో అది యిచ్చానే తప్ప - వాళ్ళకేమివ్వాలో అది యిద్దామని ప్రయత్నించలేదు. పాఠకుల వెనుక నేను పరుగెత్తాను తప్ప నా వెనుక పాఠకులను నడిపించలేదు. పాఠకులడిగారు కదా అని బూతు పుస్తకాలిచ్చేను, బైబిలు యివ్వడం మాని. వాళ్ళ మెదళ్ళని ఆలోచనా పూరితంగా చేయవలసింది పోయి అజ్ఞానాంధకారంతో నింపాను. ఆకాశంలో చందమామను చూపిస్తూ - నేల మీద చీమలపుట్టల మీదా పాములపుట్టల మీదా నడిపించాను. పవిత్రమూ, శక్తివంతమూ అయిన సాహిత్యాన్ని - పేరు కోసం .... డబ్బు కోసం .... అధఃపతనం గావించి వదిలాను. అనువాదమని చెప్పకుండా ఆంగ్ల నవలలను ఆంధ్రీకరించేసి స్వంత రచనల్లా చెలామణీ చేశాను. గ్లామరే తప్ప గ్రామర్ లేని రచనలను చేశాను. నీతి జాతీలేని నవలలు వ్రాశాను పుంఖాను పుంఖాలుగా.

అవన్నీ తక్కువ నేరాలు కావు. తాగినవాడు నిషాలో తప్పులు చేసినట్లు పేరు కోసం .... డబ్బు కోసం .... సాహిత్యంపట్ల నేనన్నీ అపచారాలే చేశాను. పాల సముద్రంలాటి సాహిత్యాన్ని విషంతో నింపాను. ఈ నేరాలకు - నన్ను ఒక్కసారి కాదు, పదిసార్లు... వంద సార్లు .... వెయ్యిసార్లు .... లక్షసార్లు హత్య చేసినా చాలదేమో! ...."

"మధుమూర్తీ! నువ్వేనా....యిలా....పశ్చాత్తాప పడుతూ....మాట్లాడుతున్నది?"

"నేనే గురువుగారూ! ఆ వేళ హోటల్ రూమ్‌లో మాట్లాడిన వాడిన్ని కాను. పునర్జన్మ ఎత్తాను. నేను మళ్ళీ రచనంటూ చేస్తే - అది మంచికి కీడు చేయకుండానూ.... కీడుకి మంచి చేసేదిగానూ ఉండేటట్లు అపరిమితమయిన జాగ్రత్త పడతాను. రాసేముందు అతి తీవ్రంగా ఆలోచిస్తాను. ఎన్ని రచనలని కాక - ఎందరిని ఉన్నతులను చేయగలవి రాద్దామా అని చిత్తశుద్ధితో ప్రయత్నిస్తాను. నా రచనలకి నేనే బాజాలు ఏర్పాటు చేసుకోను. త్రికరణ శుద్ధిగా మీకు నేను వాగ్దానం చేస్తున్నాను. నన్ను విశ్వసించండి. నేను పూర్తిగా మారిపోయాను. కళ్ళు తెరిచాను.

మాస్టారూ! నేను మిమ్మల్నొక్కటి కోరతాను. నిజానికి నా కందు కర్హతలేదు. అటువంటి కోరిక కోరేందుకు నేను తగను. కాని .. శిష్యుడిగా....స్నేహితుడిగా....సాహసించగలుగుతున్నాను...."

"ఏమిటి?"

"నా గతాన్ని .... నేను సృష్టించిన ప్రమాదకరమయిన సాహిత్యాన్ని క్షమించండి." రామచంద్రమూర్తి విభ్రాంతి చెందినట్లుండిపోయాడు మౌనంగా.

"ఏమిటాలోచిస్తున్నారు గురువుగారూ? ఓహో.... నన్ను క్షమించడానికి షరతు విధిద్దామనుకుంటున్నారా? అలాగే.

నన్ను మీరెప్పుడు హృదయపూర్వకంగా క్షమిస్తారంటే - నేనొక మంచి నవల వ్రాసి మీకు చూపాక.

మంచి నవలంటే నీకేం తెలుసు అనుకుంటున్నారు. ఏం! నా గతాన్ని బట్టి అలా భావించడం సమంజసమే. కాని- ఈ నేను ఆ నేను కానుగా? నేను పునర్జన్మ ఎత్తానుగా.

మంచి నవలంటే ఏమిటో నేను చెప్పడానికి ప్రయత్నిస్తాను. మీరు సరిదిద్దండి.

మంచి నవల - పాఠకుడిలో ఆలోచనలు రేకెత్తిస్తూ.... ఆలోచించడాన్ని అలవాటు చేస్తుందే తప్ప అతని ఆలోచనాశక్తిని నిరోధించేదిగా ఉండదు. అంటే .... ఆలోచించడం అనే సుగుణాన్ని పెంచుతుంది....''

రామచంద్రమూర్తి ముఖంలో మార్పు, మంచు కరుగుతున్నట్లు....

'' మంచి నవల - తన పాఠకుణ్ని ఉన్నత దృక్పథం కలవాడిగా తయారుచేయడానికి యత్నిస్తుంది. స్పూన్ ఫీడింగ్ (Spoon feeding) యివ్వడం కాక అతన్ని తన సమస్యలకు తానే పరిష్కారం అన్వేషించుకోగల సమర్థుడిగా చేయడమే మంచి నవల ధ్యేయం.

అతని ఊహాశక్తిని పెంపొందించడమే మంచి నవల లక్ష్యం. జీవితాన్నర్థం చేసుకుని .... తదనుగుణంగా ప్రవర్తించడం - పాఠకుడికి సూచిస్తుంది మంచి నవల.

మంచి నవల నేల విడిచిన సాము చెయ్యదు.

చదివించే గుణం కలిగి ఉంటుంది కానీ సస్పెన్సు.... థ్రిల్‌ల కోసం తన క్వాలిటీని త్యాగం చేసుకోదెంత మాత్రమూ....''

మబ్బులు విడుతూ ఆకాశం నిర్మలమౌతున్నట్లు రామచంద్రమూర్తి ముఖం - ప్రసన్నమౌతూంది.

'' మంచి నవల - అమ్మ లాటిది. కొడుకులాటి తన పాఠకుడికి మంచి బోధిస్తుంది. మంచి వేప నడిపించేలాటి కథలే చెబుతుంది. ''

'' ఔను. '' అన్నాడు రామచంద్రమూర్తి పొంగిపోతూ.

'' అందుకే....మంచి నవల రాయడం కష్టం. ఎంతో ఆలోచన ఉండాలి. చిత్తశుద్ధి ఉండాలి. పరిశ్రమ ఉండాలి. మంచి నవల - తన పాఠకుడిని పిచ్చాసుపత్రిపాలు చేయదు. జీవితాన్ని బూచిగా చూపి భయపెట్టదు. అనవసరపు ఆశలూ అపోహలూ కలిగించదు .... రక్తమాంసాలున్న పాత్రలతో .... ప్రాణమున్న కథతో.... సాగుతుంది. మంచి నవలకు మంచి హృదయం - కథా వస్తువు ...''

'' చాలు....మధుమూర్తీ....నువ్వు .... నిజంగా .... మారిపోయావు....''

'' పేరు కోసం....డబ్బు కోసం....అమ్మ నమ్ముకోడం కంటే నీచం పేరు కోసం .... డబ్బు కోసం తేలిక రచనలు చేసి పాఠకులను కలుషితం చేయడం. నిజంగా అది సమాజానికి ద్రోహం. ''

'' మధుమూర్తీ! '' ఉద్రేకం భరించలేనట్లు అతన్ని కౌగలించుకున్నాడు రామచంద్రమూర్తి.

'' ఇక నేను - రాస్తే - మంచి నవలే రాస్తాను! '' వాగ్దానం చేస్తున్నట్లే అన్నాడు మధుమూర్తి. ఆనందం భరించలేక కాబోలు రామచంద్రమూర్తి స్పృహ కోల్పోయాడు. డాక్టరు ఇ. ఇ. జి. ( E. E. G. -మెదడు స్థితిని పరీక్షించే సాధనం) తెప్పించిందక్కడికి.

పార్వతి .... దినకర్....సుభాషిణి .... దయానిధి.... మధుమూర్తి....అందరూ ఆత్రంగా వరండాలో నిరీక్షిస్తున్నారు. నిముషం నిముషమూ భారంగా మెల్లగా నడుస్తూంది. చాలాసేపయ్యాక-మెల్లగా వచ్చింది డాక్టరక్కడికి.

'' ఫరవాలేదు. ఆయన మెదడు సరి ఐనట్లే. ఒకటి రెండు రోజులలో పంపించేస్తాం. ఆయన గురించి ప్రత్యేకంగా ఏమీ చేయనక్కరలేదు. నవలల నుంచీ నవలా రచననుంచీ దూరంగా ఉంచితే చాలు....''

దయానిధి ముఖంలో రిలీఫ్ కనిపించింది. అంతకంటె ఎక్కువగా - తెరిపినపడ్డట్లు ఫీలయినవాడు మధుమూర్తి.

'' దినకర్! ఇంటికి వెళ్ళగానే మీ నాన్నగారి కంట పడకుండా ఆ తెల్ల కాగితాల బేలూ, సిరాబుడ్డీ, కలమూ దాచెయ్ '' చెప్పింది పార్వతి.

'' అలాగే అమ్మా '' అన్నాడతను బుద్ధిగా.

* స మా ప్తం *

# కసివింద మొక్క — ఎస్. ఎన్. దుర్గారావు

**( CASSIA SOPHERA )**

దీనిని సంస్కృతమున కాసమర్దః అని పిలిచెదరు. ఇది సుమారు గజమెత్తు వరకు పెరుగును. ఆకులు మిరప ఆకులను పోలియుండును. కాయలు ఉలవ కాయలను పోలియుండి సన్నగా ఐదారంగుళముల పొడవుగా నుండును. పూవులు పసుపు వర్ణము. ఇది ఆంధ్ర అంతయు పెరుగును. కొన్ని స్థలములలో అడవిగా పెరుగును.




ఇది ఎక్కువ చేదు, తక్కువ తీపి రుచి కలిగియుండును. ఉష్ణ వీర్యము కలది. త్రిదోషహరి. అజీర్ణము, దగ్గులను హరించును. వాతం పోగొట్టును. ఈ మొక్క అన్ని భాగములు విరేచనము కల్గించునని నవీన వైద్యకమతము.

వైద్యములో ముఖ్యముగా వేరు, ఆకులు, గింజలు, పూవులు ఉపయుక్తములైనవి.

కసివింద ఆకు మెతగా నూరి నూనెలో వెచ్చజేసిన గడ్డ కట్టిన రక్తం కరిగిపోవును; ఆకు వెచ్చచేసి కంటికి కట్టిన నేత్ర రోగములు శమించును; ఆకు రసము శరీరమునకు పూసిన గజ్జి, చిడుము తగ్గును; కసివిందాకు, పసుపు మెత్తగా నూరి గాయములపైనవేసి కట్టుకట్టిన అవి మానును: రెండుశేర్ల కసివిందాకు రసము, తవ్వెడు దిగువాయి నూనెయు కలిపి నూనె మిగులునట్లు కాచి వాత నొప్పులకు, పక్షవాత నొప్పులకు రాసిన నొప్పులు ఉపశమించును; కసివిందాకు స్వరసము సేవించిన దగ్గులు తగ్గును; ఆకు కషా త్రాగిన ఎక్కిళ్ళు, శ్వాసరోగములు శమించును; కసివింద వేరు నోటిలో పెట్టుకుని కొంచెము నమలి తేలుకుట్టినవాని చెవిలో వూదిన తేలు విషము దిగును; వేరు ముద్దగా నూరి ఆవు నేతితో కలిపి సేవించిన త్వరలో శ్లీపదము ( బోదకాలు ) తగ్గును; నిమ్మపండు రసముతో వేరు అరగదీసి తామరపై రాసిన పోవును; కసివింద విత్తులను, కానర విత్తులను మెత్తగా నూరి పాలలో కలిపి త్రాగిన అతి మూత్రమును అరికట్టును; లేత కసివిందకాయల కూర వండుకుని తినిన శ్వాసకాసలు తగ్గును, వాతము శమించును. ఆకు కూరకు కూడ ఈ గుణం కలదు; గింజల చూర్ణం చనుబాలతో నూరి చంటిపిల్లలకు పట్టిన బాల పాప చిన్నెలు తగ్గును. వేరు విషమ జ్వరములను హరించును. ★

# ఏ జైలయితేనేం?




ఏ రోజు విన్నా, ఏనాడు ఏ పేపరు కన్నా మారణ హోమం వార్తలే. తెల్లారిలేచి నిద్రమొహంతో రేడియాలో ఇంగ్లీషు వార్తలు వింటే పంజాబు టెర్రరిస్టుల మారణకాండ గురించి చెప్పని రోజంటూ వుండదంటే అతిశయోక్తి కాబోదు. అది ఒక అగ్నిగుండం. చల్లార్చే ప్రయత్నాలు జరుగుతున్న కొద్దీ మంటలు మింటి కెగసేలా మండుతున్నాయి. అంతేకాని తగ్గటంలేదు. హద్దూ, అదుపూ లేని ఉగ్రవాదులు ప్రతిరోజూ రక్తపాతాన్ని చూస్తున్నారు. వారి పైశాచిక కాండకు తెరపడే సమయం యిప్పట్లో రాదేమొ అనిపించక మానదు.

స్వర్ణదేవాలయం సిక్కులకే కాదు హిందువులందరికీ ఆరాధనా స్థలం. దక్షిణాది నుంచి ఉత్తరాది కెళ్ళే యాత్రికులంతా స్వర్ణాలయాన్ని దర్శించి రావటం ఆనవాయితీ. అలాంటి పవిత్ర ప్రదేశం ఉగ్రవాదుల విచ్ఛిన్నకర కార్యకలాపాలకు కేంద్రమయింది. ఆధునాతన ఆయుధాలు సమకూర్చుకుని మనిషిని కాల్చి చంపటంలో శిక్షణ పొందిన టెర్రరిస్టులు అభం శుభం తెలియని అమాయకులను తమ ఉద్యమానికి ఎర చేస్తున్నారు.

ఎవరికీ అర్థంకాని ప్రశ్న ఒకటుంది. పవిత్ర దేవాలయ ప్రాంగణాలు హత్యా రాజకీయ కూటములకు నిలయాలు కావటమేమిటీ? అని - అంతేకాదు ఉగ్రవాదుల చర్యలను సమర్థించం అని చెబుతూనే వారిని ఏరివేయటానికి స్వర్ణాలయంలోకి ప్రవేశించిన పోలీసులను వ్యతిరేకించే పెద్దల మనస్తత్వమేమిటో వారు విశ్వసించే ఆ భగవంతుడికూడా తెలియదేమొ! కాకపోతే ఉగ్రవాదులకు భయపడ్తున్నారనో, తలపంచారనో అనుకోవాల్సి వస్తుంది, పాపం పంజాబ్ ముఖ్యమంత్రి, బర్నాలాగారు పోలీస్ చర్య "తప్పనిసరి" అని ఒప్పుకుంటూనే గురుద్వారా పెద్దలు విధించిన శిక్ష ననుభవించి ఒక వారం రోజుల పాటు వివిధ గురుద్వారాలలో భక్తుల పాదరక్షలు శుభ్రం చేసి పునీతులయ్యారు. మతము, రాజకీయము ముడివడటానికి వీలులేని లౌకిక తత్త్వ వ్యవస్థలో కొనసాగుతున్నామనుకుంటున్న మనకు పంజాబ్‌లోని మత రాజకీయాలు ఆశ్చర్యాన్ని ఆవేదనను కలిగించక మానవు. చండీఘడ్ బదిలీతోనయినా ఉగ్రవాదుల దుశ్చర్యలకు అడ్డుకట్ట పడుతుందేమొ వేచి చూద్దాం!

పంజాబ్ నుంచి కొంచెం క్రిందకు దిగితే మహారాష్ట్ర సరిహద్దులకు దగ్గరగా కర్నాటకలో వున్న బెల్గాం మంటలు మండుతున్నది. శరద్‌పావర్, యస్. యం. జోషీలకు ప్రస్తుతం మహారాష్ట్రలో పెద్దగా పనేమీలేదు. పదవి చేజిక్కుతుందనే ఆశలేదు. అందుకే వారిరువురికీ "బెల్గాం" కనిపించింది. కర్నాటకలో వుంటున్న మరాఠీలను కన్నడం నేర్చుకోమనడం నేరమట! చూస్తాం నీ తడాఖా అంటూ జబ్బ చరిచి వీధుల కెక్కారు. ఫలితంగా అరాచకాండ - తుపాకీ గుండ్లు ప్రేలడం - కొందరి ప్రాణాలు గాలిలో కలవడం! సామాన్యులెంతో మంది పోయినా నేతలు సుఖంగా వుండటమే రాజకీయం. వీరేమీ భగత్‌సింగ్‌లు కాదు కదా ప్రాణాలకు తెగించడానికి.

అన్నిటికన్నా అందర్నీ విచారంలో ముంచే సంఘటన - బంగ్లాదేశ్‌లోని గిరిజనుల పాట్లు. వారంతా హిందువులు. బంగ్లాసైన్యం, ముస్లింలు వారిని నానాహింసలు పెడుతూ ప్రాణాలు తీస్తుంటే పారిపోయి మన దేశంలోకి ప్రవే

శించారు. ఇంకేముంది, సరిహద్దు భద్రతాదళం వారిని పట్టుకొని బంగ్లాసైన్యానికి అప్పగించారు. వీరు అప్పగించిన ఒకటి, రెండు రోజులకే వారిలో పెక్కుమంది బంగ్లా సైనికుల తుపాకీ తూటాలకు నేలకొరగటం బ్రతికున్న ఓ నలభైమంది ఆ నేల విడిచి మన నేల మీదకురావడం జరిగింది. ఇంకా హిందూ గిరిజనులు వస్తూనే వున్నారు. శరణార్థి శిబిరాలు ఏర్పటయ్యాయి. వారేకాదు ఏ దేశంలో హిందువులయినా అక్కడి బాధలకు తాళలేకపోతే, తమ దంటూ ఏ దేశానికి రావాలి? హిందూదేశం తమదీ అనుకోవటం నేరమా? 80 శాతం హిందువులున్న హిందూదేశం హిందువులను ఆదరించకపోతే ప్రపంచంలోని క్రైస్తవ, ఇస్లాం దేశాలు ఆదరిస్తాయా?

స్వాతంత్ర్యమా! నువ్వు వచ్చి దేశానికి మేలు కంటే కీడే ఎక్కువ కలుగజేసావు అని దేశభక్తులంతా కుమిలిపోయే రోజు అతి దగ్గర్లోనే వుందేమో?

కాకపోతే ఏమిటి? హిందూ ధర్మరక్షణకు కేశాలు పెంచి, కృపాణం ధరించిన గురునానక్ వారసులుగా పరిగణింపబడుతున్న నేటి కేశధారి హిందువులు తాము హిందువులం కాదని చెప్పుకోవడం, హిందువుల పట ద్వేషం పెంచుకోవటం, హిందువులను హతమార్చే యత్నం చేయటం?

నానక్ బోధనలుగాని తదితర పెద్దల సూక్తులుగాని ఈనాటి వారు స్మరించటం లేదని స్పష్టమవుతున్నది. అమ్మా! భరతమాత! పరాయి బందీఖానా నుంచి విడుదల చేసిన నిన్ను మా స్వంత కారాగారంలో శాశ్వత బందీగా చేయగలిగాం! భరతమాత పుత్రుణ్ణి అనిచెప్పుకోవడం కంటే తెలుగు, తమిళ, కన్నడ, మరాఠీ, పంజాబీ, బెంగాలీలుగా చెప్పుకోవడమే మాకు గర్వ కారణం. ఎందుకంటావేమో! మా పూర్వులు రాణాప్రతాప్, శివాజీ, ఝాన్సీరాణి మొ॥న వీరులంతా తమ త్యాగాలతో మా కళ్లు తెరిపించారు. త్యాగం చేస్తే స్మరించే వారుండరని తెలియ చెప్పారు. అందుకే మేము దేశభక్తిని వదలి దేహభక్తిని పెంపొందించుకుంటున్నాము. తప్పంటావా?

బహుశా యిలా చెప్పుకునే పరిస్థితి దాపురించే ప్రమాదం రాదంటారా? విజ్ఞులంతా ఒక్కసారి ఆలోచించాలి!

# ఆడ టాక్సీ డ్రయివర్

## మనకు తెలియని ప్రపంచం

### మల్లాది వెంకటకృష్ణమూర్తి

లండన్ నగరంలో 17 వేల టాక్సీలున్నాయి. 16994 మంది మెన్ డ్రయివర్స్ కేవలం ఆరుగురు మాత్రమే ఆడ డ్రయివర్స్. 1980 ఏప్రియల్‌లో జెనిస్ సాలీవ అనే మహిళ ఆరో మహిళా టాక్సీడ్రయివర్ అయింది.

టాక్సీడ్రయివర్ అవాలంటే మనదేశంలో లాగా డ్రయివింగ్ లైసెన్స్ ఒక్కటే సరిపోదు. 'పబ్లిక్ పేరేడ్ ఆఫీస్' నించి అందుకు అనుమతి పొందాలి. అది పొందాలంటే లండన్ నగరంలోని రోడ్లో, ఒక ప్రదేశంనించి మరో ప్రదేశానికి, అతి దగ్గర మార్గం, లండన్ నగరంలోని ముఖ్యమయిన స్థలాలు విధిగా తెలిసి వుండాలి. పోట్లాడే మనస్తత్వం ఉండకూడదు. కోపం, చిరాకు వున్నవాళ్ళు టాక్సీడ్రయివర్స్‌గా వుండటానికి అనర్హులు.

పబ్లిక్ పేరేడ్ ఆఫీస్ డ్రయివర్ల బ్లూ బుక్ అనే పుస్తకం ఇస్తుంది. అందులో 460 మార్గాల వివరాలు, ఓ చోటనుంచి మరో చోటికి దగ్గిరదారి ఎలా కనుక్కోవడం మొదలయిన వివరాలు వుంచారు.

టాక్సీడ్రయివర్‌గా పనిచేయడానికి అనుమతి కోరబోయేముందు లండన్ వీధులన్నీ తిరగాలి. ఒన్-వే-ట్రాఫిక్ రోడ్ల వివరాలన్నీ గుర్తుంచుకోవాలి. కొన్ని వారాలకోసారి దగ్గర మార్గాల గురించి డ్రయివర్‌ని పరీక్షిసుంటారు.

31 ఏళ్ళ జెనైస్ ఉదయం మాత్రమే టాక్సీ నడుపుతుంది. చీకటి పడ్డాక టాక్సీని బయటకి తీయదు ఆడది కాబట్టి. ఆమె టాక్సీ ఆమె స్వంతం. ప్రతి లండన్ టాక్సీలో లాగా ఆమె టాక్సీలో కూడా వైర్‌లెస్ సెట్ వుంది. దాని కాల్‌పైన 'ఎస్కీ- 83' ఎప్పుడైనా ఆమె టాక్సీ కదలకపోతే వైర్‌లెస్‌లో దగ్గరలోనున్న టాక్సీ డ్రయివర్‌ని పిలుస్తుంది. మొగ డ్రయివర్స్ ఆమెకి సాధారణంగా సహాయం చేస్తుంటారు. ఆమె టాక్సీ నెంబర్ A H V 544-T. ★





# కథలరాజు బాపిరాజు

ఇది కథలయుగం. ఆధునికాంధ్ర యుగంలో బహుళ ప్రచారంలో ఉన్న వచన రచనా ప్రక్రియల్లో కథానిక ఒకటి. నేడు సాహిత్యంలో అటు పామరుల్ని, ఇటు పండితుల్ని ఉర్రూతలూగిస్తున్న ఏకైక ప్రక్రియ కథానిక. మన సాహిత్యక్షేత్రంలో ఒక విశిష్టమైన స్థానాన్ని ఒక ప్రత్యేకమైన స్వరూపాన్ని సంతరించుకుంది నేటి తెలుగుకథ.

తెలుగువారందరు సగర్వంగా చెప్పుకోదగ్గ సుప్రసిద్ధ కథారచయితల్లో శ్రీ అడివి బాపిరాజుగారొకరు. తెలుగు కథా సాహిత్యాన్ని తనకు గల ప్రజ్ఞాపాటవంచేత దీప్తివంతం చేసిన ప్రతిభావంతులు వీరు. ఏనాడు ఆయన కథలు వ్రాయడానికి పూనుకున్నారో, ఆనాడే తెలుగు కథారంగం కళారంగంగా మారింది. తెలుగు కథా సాహిత్యక్షేత్రాన్ని కళాత్మకంగా మార్చిన కళామూర్తి బాపిరాజుగారు. వీరి ఒక్కొక్క కథ ఒక్కొక్క కళాఖండం.

## డా॥ వి. సిమ్మన్న

బాపిరాజు కథలు రాశిలో తక్కువే కాని, వాసిలో ఎక్కువే. వీరు నలభైరెండు కథల్ని వ్రాశారు. అంజలి, తరంగిణి, తూలికానృత్యం, భోగీరలోయ, రాగమాలిక, వింధ్యాచలం అనే పేర్లతో ఆరు సంపుటాలుగా వెలువడ్డాయి. కథా సంపుటాలుగా వచ్చిన కథలు ముప్పయి ఐదు. వివిధ పత్రికల్లో ప్రచురించబడ్డ కథలు నాలుగు. అముద్రిత కథ ఒకటి. అసంపూర్ణకథ ఒకటి. రేడియో కథ ఒకటి. మొత్తం కథలు నలభైరెండు. ఈ కథలేకాక " నారాయణరావు " నవలలో పాలేరు చెప్పిన కథ ఒకటి ఉంది. ఇది ఐదు పేజీలుంది. ఈ కథ గ్రామీణ వాతావరణానికి సంబంధించింది.

బాపిరాజు కథలన్నింటినీ సవిమర్శ దృష్టితోను, కళాత్మక హృదయంతోను పరిశీలిస్తే ఆయన కథారచనా విధానం, దృక్పథం, కథానిర్మాణంలో ఆయన కనబరిచిన ప్రజ్ఞాప్రాభవాలూ మనకు గోచరిస్తాయి.

బాపిరాజు కథా సాహిత్యంలో మొట్టమొదటగా మనకు కొట్టవచ్చేటట్లు కనిపించేది వస్తువైవిధ్యం. ఆయన తన కథలకు కాల్పనికత, సమకాలీన సమాజానికి సంబంధించిన వస్తువుల్ని ఎన్నుకున్నారు. భోగీరలోయ, శైలబాల, తూలికానృత్యం. సంధ్యానృత్యం, వీణ,నాగరాజు మున్నగు కథల్ని కాల్పనికత వస్తువును స్వీకరించి వ్రాశారు. వీరు కళల పరమార్థాన్ని కథల్లో వివరించడంకోసం, కాల్పనికత జగత్తును ఎన్నుకొని దానికి తగిన వాతావరణాన్ని చిత్రించి, భాషని ఉపయోగించారు. ద్వేషం,మెట్లు నరసన్నపాపాయి, బందరాక్కు, లచ్చిమి, వాన, నాగలి, దీపావళి, గుడ్డిపిల్ల, అశ్రుబిందువు మున్నగు కథల్ని సమకాలీన జీవిత వాస్తవాల్ని, సమస్యల్ని వస్తువుగా గ్రహించి తన నవవోన్మేష ప్రతిభతో ఎంతో వైవిధ్యాన్ని కనపరిచారు.

వీరి కథా ఎత్తుగడలు అందంగా ఆకర్షణీయంగా అపూర్వంగా ఉంటాయి. ఆయన కథల ప్రారంభం పాఠకులకు ఉత్కంఠను కలిగించేవిగా ఉంటాయి. కథను ఎత్తుకోవడమే తరువాయి పాఠకుణ్ణి ఏకధాటిగా చదివించే గుణం వారి కథల్లో కనబడుతుంది.

బాపిరాజు కథలు ఎక్కువగా వర్ణనతో ప్రారంభమౌతాయి. నాగలి, సోమసుత, భోగీరలోయ మొ॥ కథల్ని రచయిత వర్ణనతో మొదలుపెడతారు. ఉదా॥ "పగపట్టిన పన్నగిలా ఆ లోయ లోనికి చొచ్చుకపొయ్యాను. ప్రతి వంకరకూ ప్రత్యక్షమైన ప్రకృతి దృశ్యం సౌందర్యం మహాకావ్యంలో పుటలు తిప్పినప్పటి రసానుభూతిలా

గున్నది....(భోగీరలోయ). తూలికా నృత్యం, ద్వేషం కథలు చిత్రం చిత్రించడంతోనే ప్రారంభమౌతాయి. పాత్రను పరిచయం చేస్తూ అసురకన్య, జగ్గన్నగంటం, వసుబాలుడు మొ॥ కథలు మొదలౌతాయి. కొన్ని కథలు సంఘటనల్ని ఆధారంగా చేసుకొని ప్రారంభమవుతాయి. నరసన్న పాపాయి, సంగమేశ్వరం, గాలివాన, మొ॥ కథల్ని ఉదాహరణగా తీసుకోవచ్చు. గేయరచనతో బండరాళ్ళు, అడవిమల్లె కథల్ని ఎత్తుకొంటారు.

మన కథా రచయితల్లో ఒక్కొక్క కథకుడిది ఒక్కొక్క కథా కథనశిల్పం. ఆయా కథల్లో ఆయా రచయితల కథాకథన శిల్ప చాతుర్యం కొట్టచ్చేటట్లు కనిపిస్తుంది. కథాకథన నైపుణ్యంలో వీరు అందెవేసిన చెయ్యి. వీరు కథాకథన శిల్పంలో వైవిధ్యాన్ని వైశిష్ట్యాన్ని సాధించారు. కథారచనలో శిల్ప ప్రయోజనానికి ఎక్కువ ప్రాముఖ్య మిచ్చారు.

తెలుగు కథా సాహిత్యంలో బాపిరాజుగారి పాత్రలకు విశిష్ట స్థానముంది. ఆయన పాత్రలు ఎక్కువగా కళా జగత్తుకు సంబంధించినవి. ఆయన పాత్రలు కళా మూర్తులు, ప్రేమమూర్తులు, ప్రజ్ఞామూర్తులు, సర్వ విద్యా పరిపూర్ణులు. స్త్రీ, పురుష పాత్రలు ప్రబంధనాయికా నాయకుల్లా కనబడతాయి. జీవితాన్ని కళలకు అంకితం చేసిన కళాతపస్వి కావడంవల్ల ఆయన వలె అతని పాత్రలు కూడా కళా పిపాసువులు. ఆయన కథల్లో కనిపించే పాత్రల స్వభావాలు ఈనాటికీ సమాజంలో కనిపిస్తున్నాయి. అందుచేత బాపిరాజుగారి కథలు నేటికీ ప్రజల ఆదరాభిమానాల్ని పొందుతున్నాయి.

కథా ముఖ్యాంగాల్లో సంభాషణ ఒకటి. కథకుడు తన కథల్లోని పాత్రల విషయగుణశీల స్వరూప స్వభావాల్ని ఈ సంభాషణల ద్వారా వ్యక్తం చేస్తాడు. వీరి సంభాషణలు సహజంగా, మృదువుగా, స్వాభావికంగా, వివరణాత్మకంగా, ప్రయోజనాత్మకంగా ఉంటాయి. ప్రధాన కథకు ఎటువంటి ఆటంకాల్ని కలుగజేయవు. అంతేకాక కథకు అతిసన్నిహితంగా సంభాషణలు సాగుతాయి. కథకు సంబంధంలేని సంభాషణలు వీరికథల్లో వెదికినా కనబడవు వీరి కథా సాహిత్యంలో సహజ, సరస, స్వగత, హాస్య నాటకీయ మొదలగు సంభాషణలు చోటు చేసుకున్నాయి. వీరి వర్ణనలు కవితా గుణానికి ఎంత దగ్గరగా ఉంటాయో, సంభాషణలుకూడా అంత నాటకీయంగా ఉంటాయి.

వీరు వర్ణనా ప్రియులు. బాపిరాజు సహజంగా కవి, చిత్రకారుడు కావడం వల్ల అతని కథల్లో ఎక్కువ వర్ణనలు చోటు చేసుకొన్నాయి. ఆయన వర్ణనలు సంక్షిప్తంగా సుందరంగా, మధురాతిమధురంగా హృదయాహ్లాదకరంగా ఉంటాయి.

వర్ణన విషయంలో ప్రబంధ కవులకు ఏ మాత్రం తీసిపోరు. ప్రబంధ కవుల వలె స్త్రీ అంగాంగ సౌందర్యాన్ని మనోజ్ఞంగా వర్ణిస్తారు. స్త్రీని సౌకుమార్యంగాను, పురుషుని గంభీరంగాను వర్ణించారు. స్త్రీని దైవమూర్తిగా ఆరాధ్య దేవతగా భావించారేకాని, ఎక్కడా అసభ్యకరంగా, అసహ్యంగా వర్ణించలేదు. ఆయనకు స్త్రీలపై ఉన్న పవిత్ర భావం అటువంటిది. తన కథానాయికల్ని అతిలోక సౌందర్యవంతులుగా చిత్రీకరించడానికి శాయశక్తులా కృషిచేసి తన ప్రతిభా నైపుణ్యాన్ని ప్రదర్శించారు.

పేరు పెట్టడంలోనే కథకుని సత్తా బయట పడుతుంది. శీర్షిక చూసిన వెంటనే ఫలానా రచయిత శీర్షికని గుర్తు పెట్టినట్లు ఆకర్షణీయంగా ఉండాలి. వీరి కథాశీర్షికలు అల్పాక్షరాలతో కూడుకొని కథ పరమార్థాన్ని సూచించి ఆకర్షణీయంగా ఉంటాయి. ఆయన శీర్షికలు చిన్నవిగానేకాక ముచ్చటగా కూడా ఉంటాయి.

బాపిరాజుగారి కథలన్నీ ఇంచుమించు సుఖాంతాలే. కథల్ని మంగళాంతం చేయటంలో వీరికి ఒక ప్రత్యేక స్థానముంది. ప్రతీ కథ అందంగా, ఆనందంగా, అంత మవుతుంది. నాయికా నాయకులు ముద్దుల వర్షంలో మునుగుతూ తనివితీర కౌగలించుకోవడంతో కథ అంత మవుతుంది.

వీరు తన కథల్లో వ్యావహారిక, గ్రాంథిక భాషలు రెండింటినీ వాడారు. సాంఘిక కథల్ని వ్యావహారిక భాషలోను, కళారంగ కథల్ని గ్రాంధిక భాషలోను వ్రాశారు. ఆయన భాష సరళంగా, సౌకుమార్యంగా, కమనీయంగా ఉంటుంది. వీరి భాష సొంపుగా ఉంటుంది. అందుచేత చదవడానికి ఇంపుగా ఉంటుంది. ఆయన వచన రచనలోని భాష ముక్కుకు తాడు పోసుకుని లాక్కుపోయినట్లు ఉంటుంది. అందుచేతనే "బాపిరాజుగారి భాష కొండ చరియలలో ప్రవహించే సెలయేరు వంటిది" అని శ్రీ మొదలి నాగభూషణశర్మగారన్నారు. వీరి భాష సహృదయుల్ని చదివించడమేకాక మళ్ళీ మళ్ళీ చదివిస్తుంది.

బాపిరాజుగారి శైలి మిక్కిలి మనోహరమైంది, మృదు మధురమైంది, సహృదయాహ్లాదకరమైంది. ఆయన కథలో ఏదైనా ఒక పేరాతీసి ఇది ఎవరి శైలో చెప్పండి అంటే బాపిరాజుగారి శైలి అని ఇట్టే చెప్పవచ్చు. ఆయన స్వయంగా చిత్రకారులు కావడంవల్ల ప్రతీ విషయాన్ని సౌందర్యంగా అక్షరాలతో చిత్రాలు గీయాలని ప్రయత్నం చేశారు. ఆ ప్రయత్నమే ఆయన శైలీ రమ్యతకు ప్రత్యేక కారణమైంది. ఇదే వారి శైలిలోని ప్రత్యేకత.

ఈ విధంగా తెలుగుకథకు చక్కని రూపురేఖలు దిద్ది, కథా సాహిత్యానికే వన్నెచిన్నెలు తెచ్చి, పాఠకుల హృదయాల్లో చెరగని ముద్రవేసి కథా సాహిత్య సామ్రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించారు కథలరాజు బాపిరాజు.



# వనవాసానికి ప్రయాణం

**ఆ** మరునాడు ధృతరాష్ట్రుడు విదురుణ్ణి రావించాడు. " మృతులయిన బాంధవులందరికీ సవిశేషంగా శ్రాద్ధములు చేయాలన్న ఆలోచన నాకు కలిగింది. అందుకై వనవాసానికి ప్రయాణాన్ని కొద్ది దినాలపాటు మానుకున్నాను. నీవు ధర్మపుత్రుని దగ్గరకు వెళ్ళి యీ పనిని సమకూర్చు ! " అని విదురుణ్ణి నియోగించాడు.

ఇప్పుడంటే ఎవ్వరూ లేక, ధృతరాష్ట్రుడు విదురుని ఈ పనికి నియోగించాడని అనుకోవచ్చు, కాని నిజానికి పాండవులనూ, అందులోనూ ధర్మరాజునూ, మొగమాట పెట్టి తన కార్యాన్ని సాధించుకోవడానికి, విదురుడూ సంజయుడూ సమర్థులని ఈ కురురాజుకు బాగా తెలుసు. అందుకే జూదానికై పాండవులను ఆహ్వానించడానికి విదురుణ్ణి నియోగించాడు. ద్రుపద పురోహితుని సందేశానికి బెంగటిల్లిన ధృతరాష్ట్రుడు, పాండవులను మొగమాట పెట్టగల సామర్థ్యమున్నదని సంజయుణ్ణి రాయబారానికి పంపాడు. ఇప్పుడు బంధువు లందరికీ విశేష శ్రాద్ధ విధులను నిర్వహించాలని ఈ గూఢమతి అంటూన్నా, నిజానికి అతడు ఈ పనిని తలపెట్టింది ప్రధానంగా తన కొడుకులకు పారలౌకికమైన సౌఖ్యాన్ని అర్థించే; వారి కోసమే ఈ తాపత్రయమంతా ! అందుకే తానై ధర్మరాజును అడగడానికి సందేహించాడు. విదురుణ్ణే నియోగించాడు.

విదురుడూ వృద్ధరాజు ఇంగితాన్ని గ్రహించాడు. ఆయన అభీష్టాన్ని నెరవేర్చాలనే, ఎంతో నేర్పుగా ధృతరాష్ట్రుని మాటలను అనువదించాడు. తమ్ములతోనున్న ధర్మరాజుతో విదురుడు, " మీ తండ్రి, మీ తాత భీష్మునికీ, బాహ్లికునకూ, సోమదత్తుకూ, దుర్యోధనాది సుతులకూ, మిగతా బంధువులకూ శ్రాద్ధములు చేయ తలపు కలిగియున్నాడు. అందుచేత కార్తీక పౌర్ణమిదాక వనానికి బయలుదేరడు. మరి ఈ కార్యాన్ని నీవు యథోచితంగా నిర్వహించాలి ! " అన్నాడు.

ధర్మరాజు ఈ మాటకు సంతోషించాడు. అర్జునుడు " ఇది ఉచితమైనదే ! " అన్నాడు.

**వడలి మందేశ్వరరావు**

భీమునికి మాత్రం ఇది బొత్తిగా నచ్చలేదు. " ఏది ఉచితం ? " అన్నాడు అర్జునునితో. గాంగేయాది బంధువులకు మనము వెనుక చేసిన కర్మలు చాలవా ? మనకు కావలసిన బంధువులకు, అవసరమైతే మనమే చేయలేమా ఆ శ్రాద్ధాలను ? ఈ ధృతరాష్ట్రుడు దుర్వృత్తితో మనకు చేసిన ఎగ్గులన్నింటినీ అప్పుడే మరచారా? ఆనాడు ఈ భీష్మ బాహ్లిక ప్రముఖులందరూ ఏమయిపోయారు ? కావలిస్తే, అమ్మ కుంతిని కర్ణునకు ఇంకా, ఇంకా చేయవలసిన పుణ్యకర్మల నెంతో వైభవంగా చేయనీ ! తండ్రి, తండ్రి, అని ప్రారంభించాడీ విదురుడు. పాంచాలి అవమానింపబడినప్పుడు, ఈ ఆంబికేయుడు తండ్రి అవడం ఎక్కడకు వలస పోయింది ? భీష్ముడు మొదలైన బంధువు లానాడేమయారు ? ఇంత అనునయంగా మాటాడుతూ ఉన్నా, ఈ విదురుడు వాళ్ళ కుత్సితాన్ని ఎరుగని వాడా ? "

ఇలా భీముడంటూంటే, ధర్మరాజు అతణ్ణి తగు మాటలతో అదుపులో ఉంచాడు.

అర్జునుడూ భీముణ్ణి తొందర పడకూడదన్నాడు. " ధృతరాష్ట్రుడు రాజు, వృద్ధుడు ! ఏమయినా అతడు

పూజనీయుడే! ఇంతకీ అతడు తలపెట్టింది భీష్మాది జ్ఞాతులకు పుణ్యకర్మలను చేయడమే కదా! దీనిని కాదనడం మనకు అపకీర్తికి కారణ మవుతుంది. అదీగాక, అన్నగారి మాటను మన మెప్పుడైనా కాదన్నామా? ఆయన మాటకు కట్టుబడి ఉండడం మన వ్రతం కదా!" అని భీముణ్ణి శాంత పరచాడు.

ఆ మీద అర్జునుడు విదురునితో, "మా తండ్రి పుణ్యకర్మల నెలా చేయదలస్తే అలాగే చేయనీ! నా యింటి ధనమంతా ఆయన కిస్తాను. ఏమీ సందేహించ వద్దని చెప్పు!" అన్నాడు.

ధర్మరాజున కా మాట నచ్చింది. అర్జునుణ్ణి మెచ్చుకొన్నాడు. విదురునితో, "నా ధనంతోనూ, అర్జునుని ధనంతోనూ, మహారాజును యదేచ్ఛగా పుణ్యకర్మలను చేయమను!" అన్నాడు. "మరోమాట! వనవాసాయాసం వల్ల, వికలమైన మనస్సుతో భీముడు ఏమేమో అన్నాడు. దానికి కించ పడవద్దని రాజుతో చెప్పు. అదీగాక, ఈతడేదో అనగానే అయిపోయిందా? ఏది ఏమయినా, ధృతరాష్ట్రుడు మాకు పరమ దేవత! ఆయన కిచ్చ వచ్చినట్టుగా పుణ్య విధులను ఆచరించనీ! రథాలనూ, గోవుల్నీ ఏనుగుల్నీ, బంగారాన్నీ యథేచ్ఛగా మా తండ్రి దానం చేయడానికి, అర్జునుడు సమకూరుస్తాడు. ఇంక మిగిలిన పనులకు నీవు ఉండనే ఉన్నావు!"

విదురుడు ధర్మజుని మాటలకు సంతోషించాడు. ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళాడు. "నీ కొడుకులు పుణ్యలోకాలలో సుఖించేటట్టు చేతుల నిండా దానాలు చెయ్యి. ధర్మరాజు, అర్జునుడూ తమ ధనాన్నంతనీ నీ వశంలో ఉంచుతారు," అని చెప్పాడు. భీముడన్న మాటల ప్రసక్తిని కూడా తెచ్చి, "వా డేమంటే నేమి లే! వాడు దుర్మదుడు. ఆ మాటల్ని లెక్కలోకి తీసికోకూడదు!" అన్నాడు విదురుడు.

ధృతరాష్ట్రుడు ఎంతో సంతోషించాడు. కార్తీక పౌర్ణమినాడు భూదేవకోటినెల్ల రావించాడు. ఎంతో శ్రద్ధతో శ్రాద్ధ విధులను నిర్వహించాడు.

"అతులిత రత్నకాంచన గవాశ్వ విభూషణ
వస్త్ర కన్యకా
క్షితి ముఖ వస్తు దానములు - కీర్తన కెక్కఁగఁ
నవ్విభుండు సు
వ్రతుఁడయి చేసెఁ బంచ దశ - వాసరముల్
నిజ దాన తౌల్య మ
ప్రతిహత వృత్తిఁజెల్ల, విని పాండు సుతాగ్రణి ప్రీతిఁ
బొందగన్"

- ఆశ్రమ: 1-135

ఇలా భారతరణంలో మృతినొందిన బంధులోకానికంతకూ పుణ్యలోక సౌఖ్యాతిశయ పదములైన పుణ్యకర్మలన్నింటినీ ధృతరాష్ట్రుడు నిర్వర్తించాడు. కృతకృత్యుడైనాడు.

తర్వాత పాడ్యమినాడు వనవాసానికి సంకల్పం చేసాడు. భృత్యజనానికి అర్ఘ్యధనాన్నిచ్చాడు. అక్షతగంధ పుష్పాలతో గృహాన్ని పూజించాడు. సర్వపదార్థాలనూ పరిత్య

జించాడు. యాజకులు అగ్నులతోనూ, ఉపకరణాలతోనూ, ముందర ప్రక్కన నడుస్తూండగా, గాంధారితో ఇలువెడలి బయలుదేరాడు ధృతరాష్ట్రుడు. కుంతి మొదలయిన కాంతా జనానికి శోక మగ్గలమయింది. వారు ఆయనను అనుసరించి నడుస్తూనే ఉన్నారు. గుడ్లనీరు గుక్కుకుంటూనే ఉన్నారు ఆ రాజు అలాగే సాగిపోతున్నాడు

ధర్మరాజు ఆ కురురాజు దిక్కుగా చూస్తూ, శోకాన్ని అదుపులో ఉంచుకోలేక, హా ! మహారాజ ! ఎక్కడికయ్యా మమ్మల్నందరినీ వదలి వెళుతున్నావు! " అంటూ వణికిపోతూ, ఏడుస్తూ, చతికిలపడ్డాడు.

అర్జునుడు ఆయనను లేవనెత్తుతూ, ఒక వంక అన్నను ఓదార్చ ప్రయత్నిస్తూనే, తానూ దుఃఖాన్ని పొందుతూ, ఏడ్పును దిగమ్రింగుకున్నాడు. భీమసేనుడూ, నకులసహదేవులూ, కృపుడూ, యుయుత్సుడూ, సంజయుడూ, ధౌమ్యుడూ–అందరూ శోకంతో కృంగిపోయారు. కుంతి శోకిస్తూ, గాంధారి చేతిని తన భుజంమీద ఉంచుకొని, ఆమెకు బాసటగా నడుస్తూండగా, ఆ అంధ నృపతి గాంధారి భుజంమీద చేయి ఉంచి నడచిపోతుండగా, – ద్రౌపది, సుభద్ర, చిత్రాంగద, ఉలూపి, కొడుకును వెంటబెట్టుకొని ఉన్న ఉత్తర, – ఇంకా, ఇంకా ఇతర స్త్రీలు – పులుగుల గుంపుల్లా ఒక్కపెట్టున గొల్లుమన్నారు. జూదము నాడు పాండవులు పురము వెలువడి అడవి పోయేటప్పటి అనాటి స్థితిని జ్ఞప్తికి తెస్తోంది నేటి ఈ పరిస్థితి.

ధృతరాష్ట్రుడు అడవికి వెళ్ళడం నిశ్చయమేనని ఆబాల వృద్ధముగా పురము పురమంతా కదలి వచ్చింది. ఇటు నేలమీద, అటు మేడలమీద నిలిచి చూస్తూ ఉండేవారి శోకాలాపనలతో, రోదన ధ్వనులతో, భూమ్యాకాశాలు నిండిపోయాయి.

ధృతరాష్ట్రుడు పురద్వారాన్ని దాటుతూ, పౌర జనాన్ని నిలిచిపొమ్మని ఆదేశించాడు. విదురుడూ సంజయుడూ ఆతనితో 'వనానికి వెళ్ళడానికే' నిశ్చయించుకున్నారు. కృపాచార్యుడూ, యుయుత్సుడూ కూడా అలాగే సిద్ధపడగా, వారిని ధృతరాష్ట్రుడు వారించి, ధర్మరాజుకు అప్పగించాడు. కోడండ్రను నిలిచిపొమ్మని నియమించగా, వారు ధృతరాష్ట్రునికీ, గాంధారికీ ప్రణమిల్లి, కన్నీళ్ళు కారుతూండగా, కుంతిని చూస్తూ, వెనుకకు మళ్ళారు.

కాని, కుంతి మాత్రం వెనుకకు మరల లేదు.

( సశేషం )

## స్వరూప దర్శనం

ఈ భూమ్మీద
మానవుడొక ప్రశ్నగా నిలిచి
చూస్తున్నాడు !
సమాధానం చెప్పలేక
సూర్యుడు పడమటి సంద్రంలో
మునకలేస్తున్నాడు !

తరాలుగా, యుగాలుగా
కాలం తరగలెత్తి
నిశ్శబ్దాన్ని తాకి
శబ్దంలో లయిస్తూ వుంది !

మాటల్లో ఏ పువ్వుల
సవ్వడులూ లేవు
చూపుల్లో ఏ వసం
తోదయాలూ లేవు !

మానస ద్వారం
తెరిచి చూస్తే – ఏముంది ? ! ?

ప్రశ్నల సుడిగాలులు !
స్మృతుల తుఫానులు !
కరగని చీకటి ?
కావల్సినంత భీభత్సం ! !

– ఆచార్య తిరుమల

# రవీంద్రుని 'గీతాంజలి' — ఒక పరిశీలన

'గీతాంజలి' సంపుటిలోని గీతాల్ని జాగ్రత్తగా పరిశీలిస్తే మూడు రకాల రచనలు కనిపిస్తాయి. 1) విశ్వంతో తాదాత్మ్యాన్ని ఆ క్షణంలో అనుభవిస్తూ, ఆ ఆనందాన్ని, సృష్టికర్తతో ప్రత్యక్ష సంవాదంగా వ్యక్తం చేసేవి. 2) విశ్వాత్మతో సంబంధాన్ని కేవలం స్మృతిగా, విశ్వాసంగా, తాత్త్విక భావన (philosophic thought) గా వ్యక్తం చేసేవి. 3) నిర్వేదాన్ని వ్యక్తం చేస్తూ ప్రార్థనా రూపంగా వుండేవి. ఈ మూడు రకాల రచనల్నీ సోదాహరణంగా వివరించే ప్రయత్నమే ఈ రచన ఉద్దేశం.

ఆర్. ఎస్. సుదర్శనం

బాల్యం నుంచీ రవీంద్రునికి ప్రకృతి దృశ్యాలతో తన్మయీభావం పొంది కాలాన్ని మరచి ఆ ఆనందంతో విలీనం కావడం అనే అనుభవం వుండేది. నది మీద పయనిస్తూ ఏ సూర్యాస్తమయ సౌందర్యంలోనో మనస్సు లయమందితే గంటల తరబడి పడవ నిలిపి తన్మయావస్థలో వుండేవాడని ఆయన స్మృతుల్లో ఉల్లేఖింపబడింది. రవీంద్రుడు బ్రహ్మవాది. మనస్సుకి బ్రహ్మము అందదు. ఆనంద స్వరూపమైన బ్రహ్మము కేవలం ఆనందానుభూతి, ప్రేమ ద్వారానే లభ్యము. "He can be known by joy, by love. For joy is knowledge in its completeness, it is knowing by our whole being Intellect sets us apart from the things to be known, but love knows its object by fusion. Such knowledge is immediate and admits no doubt. It is the same as knowing ourselves, only more so." [Sadhana, Tagore, page 137 ]. ఈ బ్రహ్మానుభూతినే పెద్దన స్పష్టంగా వర్ణించాడు : "ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్....ఆనందబ్రహ్మమయటన్న ప్రాజ్ఞదు పు నంతర్బుద్ధి నూహింపుమా !" జె. కృష్ణమూర్తి అంటాడు : "Thought is corruption, thought is time." భావన లేక ఆలోచన ఇంద్రియానుభూతిని వక్రీకింపజేస్తోంది. మనిషిలోని సంస్కారాలూ, అహంభావమూ ఘనీభవించిన భావన ; ఇంద్రియానుభూతిని అవి వక్రీకింపజేస్తాయి. భావన అంటే మనస్సు. అది లేకపోవడమే 'Choiceless awareness'. ఛాయిస్ అంటే సంకల్పము. అది లేని చైతన్య స్థితిలో దృశ్యము, ద్రష్ట ఒకటి అవుతవి. క్షణము అనంతమౌతుంది. 'మాయ' అంటే సృష్టి కాదు మాయ, నేను-సృష్టి అంటూ ద్వంద్వాన్ని కలుగజేసే భావన, అంటే మనస్సు మాత్రమే మాయ ! దీన్నే విలియమ్ బ్లేక్ : 'When the doors of perception are cleansed, we behold creation as it is' అంటాడు. ఇంద్రియాలు సృష్టితో సంపదించే ద్వారాలు ; భావన, ఆలోచన వాటిని మలినపరుస్తాయి. జె. కృష్ణమూర్తి మాటల్నే బ్లేక్ కూడా ఏనాడో ఎలుగెత్తి చెప్పాడు. రవీంద్రుని అనుభూతి తత్త్వం యిది. ఈ అనుభూతిని సూటిగా అందించే గీతికలు 'గీతాంజలి' లో ఉత్తమ రచనలు.

"Today the summer has come at my window with its sighs and murmurs Now it is time to sit quiet, face to face with thee, and to sing dedication of life in this silent and overflowing leisure". [III Gitanjali] "Art thou abroad on this stormy night on thy journey of love, my friend? The sky groans like one in despair". [XXIII] "In the night of weariness let me give myself up to sleep without struggle, resting my trust upon thee." [XXV]. "Mirth spreads from leaf to leaf, my darling, and gladness without measure. The heaven's

river has drowned its banks and the flood of oy is abroad" [ LVII ] ఈ ఉదాహరణల్లో సృష్టికర్త సన్నిధానవర్తిగా కవివాణి వినిపిస్తుంది.

రెండవ రకమైన రచనకు ఉదాహరణలు :

"When desire blinds the mind with delusion and dust, O thou holy one, thou wakeful, come with thy light and thy thunder." ( XXXIX ) ఇది ప్రార్థన.

"From now there shall be no fear left for me in this world, and thou shalt be victorious in all my strife." ( LII ) ఇది విశ్వాసము "O thou lord of all heavens, where would be thy love if I were not ?" ( LVI ) ఇది తత్త్వ చింతన.

"When one knows thee, then alien there is none, then no door is shut. Oh, grant me my prayer that I may never lose the bliss of the touch of the one in the play of the many" ( LXIII ) ఇందులో పై మూడూ వున్నాయి. ఈ ఉదాహరణల్లో ప్రత్యక్షానుభూతి బదులు, అనుభూతిని అధారం చేసుకున్న ప్రార్థన, విశ్వాసము, తాత్త్వికమైన ఆలోచన గోచరిస్తాయి. "That I should make much of myself and turn it on all sides, thus casting coloured shadows on thy radiance—such is thy maya" ( LXXI ) ఇక్కడ ఆంగ్లకవి షెల్లీ : "Life like a many-coloured dome stains the white radiance of eternity" అనే ప్రసిద్ధ వాక్యము ఛాయ కూడా పడినట్లు కనిపిస్తుంది. ఈ రెండో రకం రచనల్లో భావం అనుభూతికి ప్రత్యామ్నాయంగా దర్శనమిస్తుంది. "I know thee as my God and stand apart—I do not know thee as my own and come closer. I know thee as my father and bow before thy feet—I do not grasp thy hand as my friend's" ( LXXVII ) ఇక్కడ సన్నిధానం, సాన్నిహిత్యం కాక తన్మయమైన అరాధన, గౌరవమే కనిపిస్తాయి.

స్ట్రార్ట్ త పాగింది?

### భావం - భాష

నా భావ దేవతకు
నా భాష ముత్యాల పల్లకి కావలె.
నా భావ ప్రసూనానికి
నా భాష హారం కావలె.
నా భావ విహంగానికి
నా భాష వ్యోమవీధి కావలె.
నా భావ మాధురికి
నా భాష విపంచి కావలె.
నా భావానికి
నా భాష కాకూడదు ఊసరవెల్లి !

— చలా రాధాకృష్ణశర్మ

మూడవ రకం :

LXXXVI గీతంలో— "Death, thy Servant, is at my door. He has crossed the unknown sea and brought thy call to my home." నిర్వేదం కనిపిస్తుంది. బహుశా ఇది భార్యా వియోగం కలిగిన సదర్భంలో వ్రాయబడింది. "It is thy messenger who stands at my door I will worship him placing at his feet the treasure of my heart. He will go back with his errand done, leaving a dark shadow on my morning, and in my desolate home only my forlorn self will remain as my last offering to thee." భార్య మరణంతో కవి జీవితంమీదే 'నల్లని నీడ' పరచుకొన్నది. "నీవు పంపిన దూత పాదాలకడ నా హృదయ నిక్షేపాన్ని అర్పిస్తున్నాను.... శూన్య గృహంలో మిగిలిన ఈ దిక్కులేని నేను కూడ నీకే చివరి సమర్పణ" అనడంలో ఎంతో నిర్వేదం కనిపిస్తుంది. అలా హృదయ విక్షేపమైన భార్యను మనసా సమర్పించినా, కవిలో ఆమెను గూర్చిన స్మృతి, ఆశ పోలేదు ! ఆమెను

ఆన్వేషిస్తూనే వున్నాడు. తర్వాత గీతం LXXXVII లో అంటాడు : " In dasperate hope I go and search for her in all the corners of my room; I find her not." తర్వాత తాను మృత్యువు నెలా ఆహ్వానిస్తాడో XC, XCI గీతాల్లో ఎంతో ఉదాత్తంగా చెప్పాడు. సర్వేశుని నీడ ఆయన్ని వదలలేదు అనడానికి ఈ గీతాలు తార్కాణం.

'గీతాంజలి' ఇంగ్లీషు ప్రచురణా (1912), ఆ గ్రంథానికి నోబెల్ బహుమతి రావడమూ (1913), రవీంద్రుణ్ణి అంతర్ముఖత్వం నుంచీ లౌకిక ప్రపంచంలోకి లాగి, బాహ్యోన్ముఖుణ్ణి చేశాయి. విద్యావేత్తగా, విశ్వకవిగా ఆయన అపారమైన కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించాడు. ఆయనకు అప్పటికే యాభై ఏళ్ళు దాటాయి. రవీంద్రుని కవితలో పై వివరించిన మూడు రకాల రచనలూ ఒక పరిణామాన్ని సూచిస్తాయి ఆంగ్ల కవి, ప్రకృతి ఆరాధకుడు, వర్డ్స్‌వర్త్‌లోనూ ఒక పరిణామం కనిపిస్తుంది. ప్రకృతితో ఆయన పొందే తాదాత్మ్యమూ దాని తాలూకు అనుభూతీ, ఏళ్ళు పైబడిన తర్వాత తనకు లుప్తం అయ్యాయి. అప్పుడు వ్రాసిన "Ode to Immortality" లో వర్డ్స్‌వర్త్ తాను కోల్పోయిన ప్రత్యక్షానుభూతి ఏమిటో గుర్తించి, అది పోయినా, దాని స్థానంలో 'Philosophic mind' తాత్త్విక దృక్పథం లభించిందని తృప్తి పడతాడు. తర్వాత ఆయన వ్రాసిన దీర్ఘ కవితలకు తొలినాటి 'Lyrical Ballads' కు లభించిన ఆదరణ లభించనే లేదు! 'నానృషిః కురుతే కావ్యం' అన్న సూక్తి ప్రకారం రవీంద్రుని కవిత్వం ఆయన ఋష్యాత్మతో ముడివడినది. కాని ఆయన బ్రహ్మ దర్శనం, బ్రహ్మానందానుభూతి ఏళ్ళు పైబడినాగా కేవలం స్మృతిగా, గాఢ విశ్వాసంగా మాత్రమే మిగిలినట్లు 'గీతాంజలి' సంపుటిలోని రచనల భిన్నత్వం తెలియజేస్తున్నది. ★



# నీడలేని నెచ్చెలి (కథ)

చి న్నా రి

"మనల్ని అర్జెంటుగా బయలుదేరి రమ్మని మా అమ్మ నిన్న లెటరు వ్రాసింది. రేపట్నుంచి ఆఫీసుకి శెలవు పెట్టండి" అంది సునీత శ్రీకాంత్ టైని సరిచేస్తూ.

"పెళ్ళి ఇంకా వారం రోజులుందిగా. అప్పుడే ఏం తొందర వచ్చిందిట? నిదానంగా వెళదాంలే?" అన్నాడు శ్రీకాంత్ పరధ్యానంగా.

"అదేమిటండీ అలా అంటారు? ఒక్కగానొక్క తమ్ముడి పెళ్ళికి నేను పెత్తనం చేయవద్దూ?" అంది సునీత చిరునవ్వుతో.

"చేద్దువులేవోయ్...అయినా నాకు తెలీక అడుగుతానూ - మీ వాడికి ఇష్టం లేకపోయినా నువ్వు అంత పట్టుబట్టి పెళ్ళి చేయించటం ఏం బాగోలేదు".

ఇంతలో పోస్ట్‌మన్ వచ్చి లెటరు ఇచ్చి వెళ్ళాడు. తన పేరుతో ఉన్న లేఖను అందుకుంది సునీత.

"ప్రేమలేఖా....?" కొంటెగా ప్రశ్నించాడు శ్రీకాంత్.

"కొంటె మాధవుడు వ్రాసి ఉంటాడు" దోరగా నవ్వుతూ అంది సునీత.

"నేను ఇహ ఆఫీస్‌కి వెళ్తున్నాను".

"ఆఁ.... ఆగండి. కాస్త కాఫీ తీసుకుని వెళ్ళండి".

"అవునులే తర్వాత తీరిగ్గా చదువుకోవచ్చు" అన్నాడు మురిపెంగా.

"ఆఫీసుకి శెలవు పెట్టటం మాత్రం మర్చిపోకండేం!" అంది కాఫీని అందిస్తూ.

"చిత్తం దేవిగారి ఆజ్ఞ" అంటూ స్కూటర్ని స్టార్ట్‌చేసి ఆఫీస్‌కి వెళ్ళిపోయాడు శ్రీకాంత్.

తలుపులు వేసి వచ్చి కూర్చుని ఉత్తరం చదువుకోసాగింది సునీత.

ప్రియమైన సునీతకు,

చాలాకాలం తర్వాత లెటరు వ్రాస్తున్నాను. మన్నించు. ఈ మధ్యనే నీ అడ్రసు నాకు తెలిసింది. చాలా ఆనందంతో కొండంత ఆశతో ఈ లేఖ వ్రాస్తున్నాను.

ప్రేమ చాలా విలువైనదనీ, మహోన్నతమైనదనీ భావించే వారిలో నేనూ ఒకతెను. ప్రేమ మనిషినీ మనిషినీ కలుపుతుందని, ఆ ప్రేమ వారధి స్వర్గలోకానికి రాచబాట అవుతుందని కలలుగన్నాను. కానీ పూలబుట్టలో పడగ విప్పిన నాగు ఉంటుందని ఊహించలేదు. పట్టపగలు చీకటి భయపడుతుందని ఊహించలేదు. మానవతను వెన్నెల కాటేస్తుందని కలలో కూడా భావించలేదు.

ఇదంతా ఏమిటని అనుకుంటున్నావా? మనం చదువుకునే రోజుల్లో మనకు ఊహలు, ఉద్దేశ్యాలూ, ఆటపాటలూ తప్ప మనం జీవితాన్ని చవిచూడలేదు. కానీ జీవితమంటే ఇప్పుడిప్పుడే కొంచెం కొంచెం అర్థం అవుతూ ఉంది.

తర్వాత నువ్వు ఎటో వెళ్ళిపోయావు. నేను మరో చోటికి వెళ్ళిపోయాను. తిరిగి ఒకరిని ఒకరు కలవనూ లేదు. చూడనూలేదు. ఇన్నాళ్ళకి నా అదృష్టం వల్ల నీ గురించి తెలుసుకోగలిగాను. కారుచీకట్లో కాంతి పుంజంలా నాలో ఆశ తళుక్కుమంది.

సునీతా !

ఒకనాడు మనం అనుకున్న మాటల్ని ఇంకా మర్చిపోలేదు. మనలో ఎవ్వరికీ మోసం జరిగినా, కష్టం వచ్చినా మరొకళ్ళం ఆదుకోవాలని, అన్నావు. ఆనాటి ఆ మాటలే నన్ను కాస్త నిలబెట్టాయి. పోతున్న ప్రాణానికి ఊపిరి పోశాయి.

నీ గురించి తెలిసినా నీ వద్దకు పరుగెత్తుకు రాలేక పోయాను. కారణం – కాలసర్పం వేసిన కాటుతో నా బ్రతుకు చుట్టూ అంధకారం వ్యాపించింది. భయం నన్ను మింగేస్తుంది. సంఘం దుయ్యబడుతుంది. ఆదుకోలేని సమాజం శిక్ష విధిస్తానని బెదిరిస్తుంది. ఈ స్థితిలో ఏ ముఖం పెట్టుకుని రాను ? రాలేను కూడా !

కథలా ఉందా ఉత్తరం ? అవును సునీతా ! నా బ్రతుకు ఒక ట్రాజెడీ కథే ! ఈ దుఃఖఃపూరితమైన కథను చదివి "పాపం" అని ఊరుకుంటావో, ఆదుకొంటావో ?

నా కథను చెప్పి నిన్ను ఇంకా విసిగించదల్చుకోలేదు. అయినా నాబాధని ఎవరితోచెప్పుకోను ? నా బాధను ఎవరితో పంచుకోను ? నా కథవిని "ఊ" గొట్టె వారెవ్వరు ? నా కథకు ముగింపు చెప్పేవారెవ్వరు ? నువ్వు తప్ప !

సునీతా ! మనిద్దరమూ ఇంటర్‌మీడియట్‌తోనే విడిపోయాం. నేను హైద్రాబాద్ వెళ్ళిపోయాను. నువ్వు విజయవాడలోనే ఉండిపోయావు.

ఆ రోజుల్లో నాకు "సుధీర్" పరిచయమయ్యాడు. అందమైన ముఖ వర్చస్సు, కనుముక్కు తీరు, రంగు, రూపు, ఎత్తు ఒకటేమిటి తెలుగు సినిమా హీరోకున్న లక్షణాలన్నీ అతనిలో ఉన్నాయి. అతనితో పరిచయం రానురాను స్నేహంగా మారింది. ఆ స్నేహం అతి కొద్ది కాలంలోనే "ప్రేమ"గా రూపాంతరం చెందింది.

సుధీర్ ఎమ్మెస్సీ సెకండియరు చదువుతున్నాడు. నేను బియస్సీని పూర్తి చేశాను. నాకు ఇంకా చదవాలని ఉంది. కానీ మా ఇంటివద్ద నాకు పెళ్ళి సంబంధం చూసి నిశ్చయించారు. నేను పెళ్ళి చేసుకోనని వాగ్యుద్ధం జరిపి సుధీర్ రూముకి వచ్చేశాను.

అప్పుడు సమయం రాత్రి పది దాటుతూంది.

ఆ రోజుని నేను ఎప్పటికీ మర్చిపోలేను.

* * *

"ఏమిటి సువర్ణా ఇంత రాత్రివేళ వచ్చావు ?" అడిగాడు సుధీర్ ఆశ్చర్యంగా.

"నాకు పెళ్ళి నిశ్చయించారు. నేను అప్పుడే చేసుకోనని మొండి పట్టుపట్టాను. మా నాన్న నన్ను తిట్టి, కాళ్ళూ చేతులు కట్టి అయినా సరే పెళ్ళి జరిపిస్తానని సవాలు చేశాడు. అయినా నేను నిన్ను తప్ప మరొకర్ని పెళ్ళి చేసుకుంటానా సుధీర్ ...." అంది చిన్నపిల్లలా వెక్కుతూ.

"సువర్ణా.... నాకోసం అన్ని బంధాలను త్రెంచుకొని వచ్చేశావా" ఆశ్చర్యంగా సువర్ణవైపు చూస్తూ అడిగాడు.

"అవును సుధీ.... మనల్ని ఎవ్వరూ విడదీయలేరు. ఈ జన్మఅంతా మీ సాహచర్యంలో నేనూ నా సాహచర్యంలో మీరూ...." మాటలురాని మంత్ర ముగ్ధలా, సుధీర్‌ని అల్లుకుపోయింది.

"అలాగే సువర్ణా ఆరు నూరయినా మనిద్దరమూ వేరు కాలేము. మనం పెళ్ళిచేసుకుందాం. కానీ ఒక్క సంవత్సరం ఓపికపట్టాలి. నేను ఎమ్మెస్సీ పూర్తిచేసిన తక్షణమే నిన్ను పెళ్ళిచేసుకుంటాను. మా అమ్మా నాన్నలకు నేను ఒక్కడినే కొడుకును. అందుకే వాళ్ళు నా ఇష్టప్రకారమే చేస్తారు."

"అయితే.... అప్పటిదాకా ఎక్కడ ఉండాలి ?" అనడిగింది శుష్కంగా నవ్వి.

" ఇక్కడే ఉండు. నా కే మీ అభ్యంతరం లేదు " అన్నాడు సుధీర్.

" ఇక్కడుంటే మీ చదువుకి ఆటంకం కలుగుతుంది. నావల్ల మీరు అనవసరంగా శ్రమకు గురిఅవుతారు. అయినా, పెళ్ళికాని యువతి పెళ్ళికాని యువకుని ఇంట్లో ఎంత స్వచ్ఛంగా ఉన్నా ఈ సమాజం చూస్తూ ఊరుకోలేదు. అనుక్షణం మనశ్శాంతి లేకుండా, నానా చిత్రహింసలకు గురిచేస్తుంది. మా పెద్దలకు నేను ఇక్కడున్నట్లు తెలిస్తే నా మెడకు ఉచ్చువేసి అయినా నన్ను ఇక్కణ్నుంచి లాక్కుపోతారు. "

" పోనీ.... మాఇంటికి తీసుకెళ్తాను. అక్కడ నిక్షేపంగా ఉండవచ్చు "

" వద్దు సుధీ ... నేను ఇప్పుడు అనాధను. నామాటకు విలువనిచ్చి, నన్నూ ఓమనిషిగా గుర్తించలేని మా బంధువులంతా నాకు ఇప్పుడు ఏమీకారు. ఆత్మీయులు మీరు ఒక్కరు తప్ప నాకు ఎవ్వరూ లేరు. నన్ను ఏదైనా అనాధ శరణాలయంలో చేర్చు. ఈ సంవత్సరమూ నీకోసం గడిపేస్తాను ఎలాగోలా ! " అంది సాలోచనగా.

" నువ్వు అనాథవుకావు సువర్ణా. నువ్వు నా దానవు. పిచ్చి ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు " వారింపుగా చూశాడు సువర్ణవైపు.

" లేదు సుధీ ... బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. పెళ్ళికాని ఆడది తల్లితండ్రులదగ్గర తప్ప మరెక్కడున్నా, ఈ సమాజం చూస్తూ ఊరుకోలేదు. " అంది సువర్ణ నిర్లిప్తంగా.

" సరే సువర్ణా.... నీకోరిక ప్రకారం అనాధ శరణాలయంలో చేర్పిస్తాను. నా డిగ్రీ ముగిసిన తక్షణమే నిన్ను వెతుక్కుంటూ వచ్చి నీ మెడలో తాళి కట్టేస్తాను " అన్నాడు సుధీర్ చిలిపిగా నవ్వుతూ.

" ఏమిటీ నాఇష్టంలేకుండానే " సువర్ణ అమాయకత్వాన్ని కళ్ళల్లోకి తెచ్చిపెట్టుకుంటూ.

## గాంధీజీ

చిన్న విత్తనంలో
పెద్ద మఱ్ఱిచెట్టు దాక్కున్నట్టు
బక్క పలుచని శరీరంలో
త్రివిక్రముని అతిక్రమించిన
సత్యాహింసల మహామనీషి !
నోటినుంచి వచ్చిన ప్రతి మాటనూ
ఆచరించి చూపించిన ఆధునిక మహర్షి !
భూగోళం మీద సంచరించే ప్రతి వ్యక్తీ
ఆచంద్రతారార్కమూ ఆదర్శంగా
చేసికొనవలసిన
అపూర్వ జీవనశేముషి !
బుద్ధుణ్ణీ జీసస్‌నీ కలిపి
బ్రహ్మ నిలిపిన మనిషి ! !

డా. తంగిరాల వెంకట సుబ్బారావు

" ఆహా ! దేవయాని వివాహం ఎలా జరిగిందో నీకు తెలియదా ? అలాగే మనకూ గాంధర్వ వివాహం జరిగిపోతుంది " అన్నాడు సుధీర్ సంభ్రమంగా.

" అలాగే సుధీ.... నీకోసం ఒక సంవత్సరం అజ్ఞాతంగా ఉంటాను. నాకు నువ్వు ఎలాంటి ద్రోహమూ చెయ్యలేవు. ఆ నమ్మకం నాకుంది " సంతృప్తిగా అంది సువర్ణ.

" పిచ్చి సువర్ణా.... అతిగా ఆలోచించి మనస్సును పాడుచేసుకోకు " అన్నాడు సుధీర్ మందలింపుగా.

ఆ రాత్రే నన్ను అనాధ శరణాలయంలో చేర్పించాడు సుధీర్.

* * *

అక్కడ నేను అనుక్షణమూ సుధీర్‌ని ఆరాధిస్తూ రోజులు వెళ్ళబుచ్చుతున్నాను.

నేను ఎదురుచూస్తున్న ఆ శుభఘడియ మమ్మల్ని వెతుక్కుంటూ అతిచేరువగా వచ్చేసింది. కానీ మమ్మల్ని చేరలేకపోయింది.

' శెలవల్లో ఇంటికి వెళ్ళిన సుధీర్‌కు యాక్సిడెంట్ అయిందన్న వార్త ' నన్ను గాఢాంధకారంలోకి శోక సముద్రంలోకి నెట్టివేసింది.

ఎవరి కోసమైతే తల్లి తండ్రులను ఎదిరించి, అన్ని బంధాలనూ త్రెంచుకుని వచ్చేశానో .... ఎవరి కోసమైతే ఎన్నో గాలిమేడలు కట్టి ఊహాలోకాలలో విహరించానో, వారు లేనప్పుడు ఇంక నేను మాత్రం ఎందుకు ? ఒంటరిగా ఇలా ఎంతకాలం బ్రతకాలి ? ఎవరికోసం బ్రతకాలి ? ఎందుకోసం బ్రతకాలి ?

బంధాలనే ఆకులను రాల్చివేసిన చెట్టుకు, కొత్త చిగురు పట్టకపోతే మోడులా నిల్చిపోవాల్సిందేనా ?

నాకున్న ఒక్క ఆశ, నీడ, కాంతి అన్నీ అదృశ్య మయినప్పుడు, నేను కూడా ఎందుకూ ?

ఇంటికి ఏ ముఖం పెట్టుకుని వెళ్ళగలను ! ఒక వేళ వెళ్ళినా....ఊహూ....వెళ్ళను, వెళ్ళలేను కూడ. ఇకపై ఈ అనాధ శరణాలయంలో అనాధగా బ్రతకాల్సిందేనా ? అందరూ ఉన్నా, అనాధగా మిగిలిపోవాల్సిందేనా ? నేను ఎంతగానో ప్రేమించిన సుధీర్ లేనప్పుడు నేను కూడా ఉండి ఎందుకు ?

దేవుడు ఎంత కఠినాత్ముడు ?

విధికి మాపట్ల దయలేదా ?

సునీతా ! విన్నావా నా గాధనూ....

నాకు ఇక్కడ ఉండాలనిపించటం లేదు. ఎక్కడికి వెళ్ళినా నాపై ఈ సమాజం చిన్న చూపే చూస్తుంది. అయినా ఏమీలేని నేను ఎక్కడికని వెళ్ళను ? అందుకే నీ దగ్గరకు వస్తే చేరదీస్తావా ? నీడలేని నీ నెచ్చెలికి నీడ నివ్వగలవా ? నాకు ఓ చిన్న జాబును చూసి పెడితే జీవితమంతా నీకు కృతార్థురాలిగా ఉండిపోతాను. నా అడ్రసు ఈ క్రింద ఇస్తున్నాను. నీ నిర్ణయం కోసం, నీ లెటరు కోసం వేయి కళ్ళతో ఎదురు చూస్తుంటాను.

\- సువర్ణ

సువర్ణ వ్రాసిన సుదీర్ఘ లేఖనుచదివి అప్రతిభురాలైంది సునీత.

సునీత ముఖం కళాహీనంగా, పాలిపోయింది. మనస్సు అల్లకల్లోలితమైంది. శిలలా భావ రహితంగా కూర్చుండి పోయింది.

ఏం చెయ్యాలో పాలుపోలేదు. అర్థంగాని సందిగ్ధంలో పడి పోయింది. చివరగా ఓ నిశ్చయానికి వచ్చి సువర్ణకు వెంటనే రమ్మని లెటరు వ్రాసింది.

సునీత వ్రాసినట్లే సువర్ణ వచ్చింది.

" సునీతా.... " అంటూ సునీత భుజం మీద వాలి పోయింది సువర్ణ.

" నన్ను క్షమించు సువర్ణా.... నీకు చాలా దారుణ మైన ద్రోహాన్ని చేశాను. " అంది సునీత బాధగా.

" ఏమైందే....నువ్వు చెప్పేది నాకర్థం కావటంలేదు" అంది సువర్ణ ఆశ్చర్యంగా.

" సుధీర్ ఎవరో కాదు. నా తమ్ముడే. " అంది మంద స్వరాన. " అంతేకాదు నువ్వని తెలీక టెలిగ్రాంను ఇప్పించింది కూడా నేనే " అంది సునీత బాధగా.

కొరడాతో ముఖాన ఛెళ్ళున కొట్టినట్లు, తృళ్ళిపడింది సువర్ణ. కొంచెం సంబాళించుకొని " సునీతా.... " అంది ఖంగుతిన్నట్లుగా.

" అవునే ! మా తమ్ముడు శెలవలకు ఇంటికి వచ్చి నప్పుడు పట్టుపట్టి వాడికి పెళ్ళినిశ్చయం నేనే చేయించాను. సుధీర్ నాకు తన ప్రేమ గురించీ, ప్రేయసి గురించీ అంతా చెప్పాడు. నేను తేలికగా వాడి మాటను కొట్టివేశాను. ఆ తర్వాత సుధీర్‌కు యాక్సిడెంట్ అయినట్లు టెలిగ్రాం ఇప్పించాను. సారీ సువర్ణా.... నాకు నువ్వే అని తెలవదు. తెలిస్తే ఇంతదాకా రానిచ్చేదాన్నా " అంది సునీత సంజా యిషిగా.

ఆమాటలకు ఉక్రోషంగా సునీతవైపు చూసింది సువర్ణ.

" సునీతా.... ! ఎంత కఠినాత్మురాలివి . నీవు ? ప్రేమంటే ఇంతేనా నువ్వు అర్థం చేసుకున్నది! ప్రేమకు నువ్వు ఇచ్చే విలువ ఇదేనా ? నేనే మీ తమ్ముడి ప్రేయసినని తెలీక పెళ్లిగ్రాం ఇచ్చావనన్నావు. ఏం నా స్థానంలో వేరే అమ్మాయిఉంటే ఆమెకూ నాలాగే మనఃక్షోభ కలుగదనుకున్నావా? ఆమెకూడా అనాథగా నిస్తేజంగా మిగిలిపోదను కున్నావా ? ఆమెకూ నా కెదురైన పరిస్థితే ఎదురవదనుకున్నావా ? అయినా నిక్షేపంగా ఉన్న సుధీర్‌కి ఏక్సిడెంట్ అయినట్లు పెళ్లిగ్రాం ఎందుకు ఇచ్చావు? అంత ఖర్మేం పట్టింది ? ఓ దెయ్యమా ! మావాణ్ణి మాకు వదిలెయ్యి. వాడికి పెళ్ళి చేస్తాం అని ఓముక్క వ్రాసి నా ముఖాన పడవేస్తే నేను కాదనేదాన్నా " అంది సువర్ణ సునీత వైపు తీక్షణంగా చూస్తూ.

ఆ చూపులు చురకత్తుల్లా ఉన్నాయి.

" లేదు సువర్ణా ... అనవసరంగా ఆవేశ పడకు ప్లీజ్ కంట్రోల్ యువర్ సెల్ఫ్. నామాట విను. నేను అలా ఎందుకు చేయవల్సి వచ్చిందో నీకు వివరిస్తాను. " అంది సునీత వారింపుగా.

" ఏం నేనైతే ఒక విధంగా చేసుండే దానివి మరొకరైతే మరొక విధంగా చేసుండేదానివి. అసలు ప్రేమ జంటను విడదీయటానికి నీకు మనస్సెలా వచ్చింది సునీతా ? " అంది ఆవేశంగా.

" సువర్ణా.... ప్లీజ్.... నే చెప్పేది విను. ఆ తర్వాత నువ్వు ఎన్ని మాటలు అన్నా భరిస్తాను. మన స్నేహితురాలు " విశాలి " తెలుసుగా ! పాపం వాళ్ళది మధ్యతరగతి కుటుంబం. పెళ్ళికి ఎదిగికూర్చున్న విశాలి, గుండెలమీద కుంపటిలా, ఇంకా నలుగురు కూతుళ్ళకి పెళ్ళి చెయ్యగలనా అన్న బెంగతో మంచం పట్టి చనిపోయాడు వాళ్ళ నాన్న. పాపం. ఆసంసారానికి మరేమీ ఆసరా లేదు నడిసముద్రంలో దారితెలియని నౌకలా ఉన్న ఆ సంసారానికి ఏదో విధంగా సహాయం చెయ్యాలనే ఉద్దేశ్యంతో విశాలిని పెళ్ళి చేసుకోమని మా తమ్ముణ్ణి కోరాను. అపుడు తన ప్రేయసి గురించి చెప్పాడు. కాలం ఎంత పెద్ద గాయాన్నయినా మాన్పుతుందని, విధి వ్రాత

## నరకం

తమస్సు నిండిన మనస్సు
దేన్నీ చూడలేదు సవ్యంగా
చూచినంత మేరా దానిదంతా
వక్రమార్గమే
మహాత్ముల్ని పరిహసిస్తుంది
అల్పుల్ని ఆశ్లేషిస్తుంది
మంచిని ద్వేషిస్తుంది
చెడుతో స్నేహిస్తుంది
మల్లెతోటల్ని నరికేస్తుంది
ముళ్ళని దారుల్లో విసిరేస్తుంది
అమాయకుల్ని హింసిస్తుంది
రాక్షసంగా చిందేస్తుంది
కూల్చడమే దాని తత్వం
నిర్మించడం దాని కసాధ్యం
నరకానికి మరో పేరు తమస్సు
తమస్సు నిండిన మనస్సు
చూపంతా వక్రంగానే
కూల్చడమే దాని పని
నిర్మించడం దాని కసాధ్యం
తమస్సు నిండిన మనస్సుకు
మరో పేరు నరకం.

తిరునగిరి

బాగుంటే నీ ప్రియురాలూ సుఖంగా బ్రతుకగలదనీ నంజాయిషీ ఇచ్చాను. విశాలిని పెళ్ళి చేసుకుంటే ఓ సంసారాన్ని ఆదుకొన్నట్లూ ఉంటుంది. పైగా విశాలి కూడా మన స్నేహితురాలేగా అన్న ఉద్దేశ్యంతో ఆ పెళ్ళిని నిశ్చయం చేయించాను" అంది సునీత తలవంచుకుని.

సునీత చెప్పిన వైనానికి సువర్ణ కొంచెం చల్లబడింది.



## మానుషం

మతమౌఢ్యం ముందు
మతసహనం ఓడిపోయింది
వంచన ముందు
మంచితనం తలవంచింది
శాంతి కపోతం
రక్తపిపాసి చేతిలో రాలిపోయింది
కంచే చేను మేసిన
వైనం చూసి
పట్టపగలే
సూర్యుడస్తమించి,
గాఢాంధకారం,
ఈ భువి నలుముకుంది.

— గరికమూర్తి రాజేంద్ర



అప్పుడే సుధీర్, శ్రీధర్‌లు లోపలకు వచ్చారు.

శ్రీధర్‌ని సువర్ణకు పరిచయం చేసింది సునీత. సువర్ణను చూసి తలవంచుకున్నాడు సుధీర్. ఒక్క క్షణం నిశ్శబ్దం రాజ్యమేలింది.

పరిస్థితినంతా శ్రీధర్‌కి వివరించింది సునీత.

" అయితే ఏం చేద్దామనుకుంటున్నావు ? పాపం అంత దూరం నుంచి ఎంతో ఆశగా వచ్చిన ఆమెకు నువ్వు ఏ విధంగా నీడ నివ్వగలవు ? నీడ కల్పించినా, ఈ వాతావరణంలో ఆమె ఇమిడిపోగలదా ? " తీక్షణంగా అడిగాడు శ్రీధర్.

" నా నిర్ణయమూ వినండి. నేను సువర్ణకు ఒక స్నేహితురాలిగానే కాక ఒక ఆత్మీయురాలిగా న్యాయాన్ని చేకూర్చగలను. సువర్ణకూ-సుధీర్‌కూ వివాహం జరుగుతుంది " అంది సునీత మందస్వరాన.

" సునీతా...." అరిచినంత పని చేసింది సువర్ణ.

" ఏమే నీకేమైనా పిచ్చిపట్టిందా? ఇప్పటికే ఓ మంచి పని చేశావని అనుకుంటున్నాను. మళ్ళీ పెళ్ళి ఆపించి విశాలికి అన్యాయం చేసి మరో తప్పును చెయ్యకు. ప్లీజ్...." ప్రార్థనాపూర్వకంగా అంది సువర్ణ.

"నీకా భయం ఏమీ లేదు సువర్ణా. నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయాన్ని తీసుకున్నాను. విశాలికి అదే ముహూర్తంలో శ్రీధర్‌గారి తమ్ముడు మురళితో పెళ్ళి జరుగుతుంది. ఈ విషయమై మురళిని రకరకాలుగా అర్థించాను. మురళీ కూడా ఒప్పుకున్నాడు " అంది సునీత కుష్కంగా నవ్వి.

"ఇప్పుడు చెప్పండి. నా నిర్ణయం సరియైనదో కాదో" అడిగింది సునీత శ్రీధర్ వైపు చూస్తూ.

" పిచ్చి సునీతా ! మరీ ఆవేశ పడిపోకు. మొన్ననే నువ్వు మీవూరు వెళదామన్నావు. మళ్ళీ ప్రయాణాన్ని ఆపించేశావు. కారణం నాకు బోధపడలేదు. విషయం తెల్పుకుందామని నీ లెటర్ని చదివాను. నువ్వు ఏ విధంగా సువర్ణను ఆదుకోగలవోనని ఇప్పటిదాకా తీక్షణంగా అడిగాను. కానీ నువ్వు తీసుకున్న నిర్ణయాన్నే నేనూ ఖాయపర్చాను నీ కన్నా ముందే ? అందర్నీ నేనూ సుధీర్‌లు కలిసి ఒప్పించేశాం. ఇక ఆలస్యం మీ సువర్ణదే " అన్నాడు శ్రీధర్ చిరునవ్వుతో.

క్షణంసేపు సువర్ణకు మాటలు రాలేదు.

" థాంక్యూ సునీతా....నిజంగా స్నేహం ఎంతో విలువైనది. మీలాంటి ఉత్తముల్ని స్నేహితులుగా పొందటం నిజంగా నా అదృష్టం. థాంక్యూ సునీతా .... థాంక్యూ వెరీమచ్...." అంది సువర్ణ తృప్తిగా.

" నన్ను క్షమించు సువర్ణా....నీకు చాలా అన్యాయం చేయ తలపెట్టాను" అన్నాడు సుధీర్ తలవంచుకుని.

" అవేం మాటలండీ....మీరే నన్ను క్షమించాలి. " అంటూ సుధీర్ గుండెల్లో వాలిపోయింది సువర్ణ.

ఆమె ఇప్పుడు నీడలేని నెచ్చెలి కాదు. గూడు కల గువ్వ !



# ఉపనిషత్కన్య గార్గి ............ సి. వేదవతి

## ( బృహదారణ్యకోపనిషత్తు )

విదేహ రాజైన జనక చక్రవర్తి మహా విద్వాంసుడు. అతడు ఒక గొప్ప యజ్ఞం నిర్వర్తించి, అచటకు విచ్చేసిన పండితులకూ మహర్షులకూ భూరి దక్షిణలు ఇచ్చి సత్కరించినాడు. వారందరిలోనూ సర్వశ్రేష్ఠుడైన మేటి పండితుడెవరో తెలుసుకొనవలెనని కుతూహలం కలిగినది చక్రవర్తికి.

బంగారు తొడుగుల కొమ్ములతో మెరిసిపోతూ, కన్నుల పండువుగా వున్న శ్రేష్ఠమైన వేయి గోవులను యాగశాలకు ఎదురుగా నిలిపి—"మహాత్ములారా! మీలో ఉత్తమ బ్రహ్మనిష్ఠ డెవరో ముందుకు వచ్చి, పండిత చర్చలో విజయులై, ఈ గోసహస్రమును గ్రహింప గలరు"...అన్నాడు జనక మహారాజు.

అచట చేరిన విద్వాంసులందరూ సంభ్రమాశ్చర్య చకితులైనారు. కాని, ఎవరూ ముందుకు వచ్చే సాహసం చేయలేకపోయినారు. అంతటా నిశ్శబ్దం. అప్పుడు ఒక గంభీర స్వరం—ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ వినవచ్చినది. ఆ గోసహస్రమును తన ఆశ్రమానికి తోలుకుపోవలసినదిగా శిష్యులను ఆజ్ఞాపిస్తున్న ఆ స్వరం మహర్షి యాజ్ఞవల్క్యునిది.

అప్పుడు జనకుని ఆస్థాన విద్వాంసుడు అశ్వలుడు ముందుకు వచ్చి-" యాజ్ఞవల్క్యా! మా అందరికంటే నీవే గొప్ప విద్వాంసుడనని ఎట్లా అనుకుంటున్నావు? నీ బ్రహ్మ జ్ఞానం నిరూపించుకొని గాని - గోవులను గ్రహించటం న్యాయం కాదు "....అన్నాడు.

" అశ్వలా! బ్రహ్మజ్ఞానం పొందిన మహానుభావులు ఎవరైనా వుంటే, వారికి నేను వినమ్రంగా నమస్కరిస్తాను. కాని, నేను ఒక నిరుపేద బ్రాహ్మణుడను మాత్రమే! ఈ గో సహస్రము నా ఆశ్రమానికి అవసరం అని మాత్రము ఎరుగుదును నేను"....అన్నాడు యాజ్ఞవల్క్యుడు చతుర సంభాషణా స్ఫూర్తితో.

అంతటితో, అశ్వలునితోపాటు అక్కడ వున్న పండితులు బ్రహ్మజ్ఞానమును గురించి పరి పరి విధాలుగా ప్రశ్నించినారు. అన్నిటికీ తగు విధంగా సమాధానములు చెప్పి, యాజ్ఞవల్క్యుడు తాను బ్రహ్మవేత్తనని నిరూపించుకొనినాడు.

ఈ విధంగా యాజ్ఞవల్క్యుని ప్రశ్నించి పరీక్షించిన వారిలో వచక్నుని పుత్రిక ' గార్గి ' అనే మహిళ కూడా వుండటం ఎన్నదగిన విశేషం.

" ఈ సృష్టి అంతా దేనితో ముడిపడి వుంది? "....అంటూ ఆమె సునిశితంగా అడిగింది మహర్షిని.

' ఆకాశంతో '....అని సమాధానం.

' మరి ఆకాశం దేనితో ముడిపడి వుంది? '

" బ్రహ్మలోకంతో.... "

" మరి బ్రహ్మలోకమో ? "

యాజ్ఞవల్క్యునికి నవ్వు వచ్చినది. కొద్దిగా విసుగు కలిగినది. " అధిక ప్రసంగం వలదు సుమా! "....అన్నాడు మందలింపుగా.

కొంతసేపు ఊరుకుని, మళ్ళా ధైర్యం పుంజుకుని, గార్గి ఇట్లా ప్రశ్నించినది.

" మహాత్మా! కాశీ విదేహ వీరులు రణరంగంలో విల్లు ఎక్కుపెట్టి నిలిచినట్లుగా, నేను రెండు ప్రశ్నలతో మీ ముందు నిలిచాను. ఈ బ్రహ్మాండముపైనా, పృథివికి క్రిందుగానూ వుంటూ, భూత భవిష్యద్వర్తమానాలను

నెలయించే భూధాని దేనితో ఓతప్రోతమై వున్నదో సెలవిస్తారా ? "

"అక్షరంతో...." అని సూటిగా మహర్షి సమాధానం.

"గార్గీ ! అదే పరబ్రహ్మం. సృష్టి స్థితి కారకమైనదీ, ఆద్యంతరహితమైనదీ, జరామృత్యువులకు అతీతమైనదీ అయిన పరమసత్యం. అదే ! అదే పరబ్రహ్మ స్వరూపమైన పరమసత్యం, ఆ అక్షర సత్యాన్ని, ఆత్మతత్త్వాన్ని తెలుసుకొన్నవాడే బ్రహ్మవేత్త "....అని నొక్కి చెప్పినాడు మహర్షి.

" యాజ్ఞవల్క్య మహర్షి బ్రహ్మతత్వాన్ని సాకల్యంగా తరచి చూచిన మహానుభావుడు. ఆయనను జయించ గలిగిన పండిత శ్రేష్ఠులు మరెవరూ లేరు "....అంటూ గార్గి మహర్షికి చేతులెత్తి నమస్కారం చేసినది.

స్వయంగా మహా జ్ఞాని అయిన జనక చక్రవర్తి కొలువులో-అంతమంది పండిత ప్రకాండుల సమక్షంలో-బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడైన యాజ్ఞవల్క్యుని ప్రశ్నించ గలిగిన గార్గి ఎంతటి ధీరోదాత్త మహిళయో అంతటి విద్వాంసురాలు

(ఆకాశవాణి సౌజన్యంతో )

# ఏమన్నారు ?

**బాలవాణి**

**సోమంచి రామం**

నేతాజీ తానేమన్నాడు ?
భారత వీరుడేమన్నాడు ?
అజాదు హిందు ఫౌజుతోనే
స్వరాజ్య సాధన కలదన్నాడు.

బాపూజీ తానేమన్నాడు ?
బాలల తాతేమన్నాడు ?
సత్యాహింసలె జగతికి
నిత్యాలంకారాలన్నాడు.

నెహ్రూజీ తానేమన్నాడు ?
భారత నేతేమన్నాడు ?
వంచన సేయక మంచిగ బ్రతుక
పంచశీలనే ప్రవచించానన్నాడు.

శాస్త్రీజీ తానేమన్నాడు ?
లాల్‌బహదూరేమన్నాడు ?
కరువుదీర్చి పరువునిల్పి
జై కిసాన్, జై జవానన్నాడు.

ఇందిరమ్మ తానేమన్నది ?
భారత రత్నేమన్నది ?
విదేశాక్రమణ తలపే రానీక
స్వదేశ రక్షణకే పోరన్నది.

రవీంద్రుడు తానేమన్నాడు ?
వంగ కవీంద్రుడేమన్నాడు ?
పసిమనసులు వికసింప
శాంతినికేతన మన్నాడు.

నరేంద్రుడు తానేమన్నాడు ?
వివేకనందుడేమన్నాడు ?
ఉర్వి పైన మతములెన్నోయున్న
సర్వమత సారమొక్కటేనన్నాడు.

బాలబాలిక లేమంటారు ?
భావిపౌరులు మీరేమంటారు ?
జాతి మత భేదాల్ తొలగి
నీతి నియమాల్ కలిగి
సమతాభావం సాధిస్తాం
భరతవీరుల మనిపిస్తాం.

# విప్లవాత్మక సంగీత సాధనం బుర్రకథ పద్మశ్రీ నాజర్

ప్రజలను చైతన్యవంతులుగా తీర్చిదిద్దే విప్లవాత్మక మైన సంగీత సాధనమే "బుర్రకథ" అని బుర్రకథ పితామహుడు పద్మశ్రీ నాజర్ వ్యాఖ్యానించారు. శ్రీ నాజర్ ఇటీవల మచిలీపట్నం విచ్చేసి నప్పుడు ఈ వ్యాసకర్తకు ఇంటర్వ్యూ ఇస్తూ ప్రజల జీవిత సమస్యలతోనే తన బుర్రకథ జీవితం ప్రారంభం అయిందని, కాగా ఆ ప్రజలు చూపిన అభిమానానికి నిదర్శనమే తనకు అయాచితంగా లభించిన "పద్మశ్రీ" అవార్డు అని శ్రీ నాజర్ తెలిపారు.

1920 సంవత్సరంలో గుంటూరుజిల్లా, పొన్నెకల్లు గ్రామంలో ఒకపేద కళాకారుల కుటుంబంలో పుట్టిన తాను 17 వ ఏట నుండే బుర్రకథలు చెప్పటం ప్రారంభించినప్పటికి నిజానికి 1943 వ సంవత్సరంలో తాను ప్రజా నాట్యమండలిలో ప్రవేశించిన నాటినుండే తనకు గుర్తింపు లభించిందని తెలిపారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత 1949 సంవత్సరంలో ప్రజా నాట్యమండలిపై ప్రభుత్వం ఆంక్షలు విధించేవరకు ఆ మండలిద్వారా అనేక కథలు చెప్పటం జరిగిందని, ఆ నాడు తాను స్వయంగా తయారు చేసుకొని బుర్రకథలుగా తీర్చిదిద్దిన "కష్టజీవి, టాన్యా ( కమ్యూనిష్టు వీరవనిత ), బెంగాల్ కరువు, రాయలసీమ కరువు" కథలు ప్రజలను బాగా ఆకట్టుకున్నాయని శ్రీ నాజర్ తెలిపారు. ప్రజానాట్య మండలి రద్దుచేసిన తర్వాతకూడ తాను ప్రభుత్వానికి భజనచేస్తూ కథలు చెప్పలేదని, ప్రజలలో విప్లవ అభిలాష కల్గించే బొబ్బిలియుద్ధం, చావకూడు, వీరాభిమన్యు, అల్లూరి సీతారామరాజు వంటి సందేశాత్మక కథలను బుర్రకథలుగా చెప్పటం జరిగిందని గర్వంగా తెలిపారు. ప్రజానాట్యమండలి పై ఆంక్షలు విధించిన రోజుల్లో మండలిలోని తనతోటి కళాకారులు మద్రాసు చిత్రసీమలో ప్రవేశించటం జరిగిందని, అయితే తాను మాత్రం ప్రజలలో మనుగడ సాగించటానికి నిర్ణయం తీసుకోవటం జరిగిందని తెలిపారు. ఆమేరకు భారతదేశం నలుమూలల్లో ఇప్పటి వరకు కొన్ని వందల ప్రోగ్రాంలు ఇచ్చినట్లు ఆయన తెలిపారు.

అన్నవరపు బ్రహ్మయ్య

"బుర్రకథ" ప్రత్యేకత :–

నవరసాలలో ఒక్క హాస్యరసం మినహా మిగిలిన అన్ని రసాలు ఒకేవ్యక్తి ప్రదర్శించడమే "బుర్రకథ" ప్రత్యేకత అని బుర్రకథ పితామహుడు పద్మశ్రీ నాజర్ ఇటీవల ఇక్కడి విలేకరులతో మాట్లాడుతూ తెలిపారు. అందువల్లనే బుర్రకథ పూర్తిగా సంగీతం కాదనీ, బుర్రకథ అంటే "ఆటపాట" గా వ్యవహరిస్తున్నారని ఆయన తెలిపారు. ప్రాచీన కూచిపూడి యక్షగానం నుండి ఉద్భవించిందే "బుర్రకథ" అని తెలిపారు. చారిత్రక ఆధారాలను బట్టి తొలుత బుర్రకథలను "జంగందేవర" కులస్థులు మాత్రమే చెప్పేవారని, ఆకులస్థుల ఆచారాలను బట్టి వారికి ఒక్కొక్క పురుషునికి ఇద్దరు భార్యలు ఉండే వారని అందువల్ల భార్యలు ఇద్దరూ "వంతలు"గా వ్యవహరిస్తే భర్త కథ చెప్పేవారని ఆయన తెలిపారు. అయితే ఆనాడు కథ చెప్పే వ్యక్తి "తాంబుర" ఉపయోగించకుండా కేవలం "అందెలు" ( గజ్జలు ) మాత్రం ఉపయోగించే వారని శ్రీ నాజర్ తెలిపారు. తర్వాత కాలంలో బుర్రకథలు చెప్పిన శ్రీయుతులు కోటి వీరయ్య, కాకుమాను సుబ్బారావుల ద్వారా ఈకళ అభివృద్ధి లోకి వచ్చిందనీ, అయితే వారు కథా విధానంలో నిర్దుష్ట మైన పద్ధతులేవి ఆచరించలేదని ఆయన తెలిపారు. కాగా తాను కోటి వీరయ్య చెప్పే కథావిధానం కొంత మేరకు అవలంభించినప్పటికి; కొన్ని నిర్దుష్టమైన పద్ధతులు ఏర్పాటు చేయటం జరిగిందని తెలిపారు. కేవలం నాలుగో తరగతి వరకు చదువుకున్న తాను "ప్రజా నాట్యమండలి" లో పని చేసే రోజులలో కీ. శే. గరికిపాటి రాజారావు ఇచ్చిన సహకారమే అందుకు ప్రధాన కారణమని తెలిపారు. ★

## సాయంత్రం !

హుస్సేన్‌సాగర్ నీళ్ళు పగలంతా మరిగి మరిగి మెల్లగా చల్లని వాయువులను ఈ సుదీర్ఘ నగరం మీదికి ప్రసరింపజేస్తున్నవి - టాంక్‌బండ్ చివర ఇటు బషీర్‌బాగ్ అటు సెక్రెటేరియేట్‌లకు పోయే చౌరస్తాకు అవతల ఓ చిన్న పార్కు వుంది.

అక్కడ ఎప్పుడూ జన సమ్మర్దం తక్కువే.

అందులో ఓమూల రాణీ రవి కూర్చున్నారు-

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్




# హ్యూమానిటీ ఫర్ సేల్

రవి ఏవేవో కబుర్లు చెపుతున్నాడు-

రాణి ఏమిటేమిటో వింటున్నది.

అతడు చెపుతూ రాణిని చూస్తున్నాడు.

రాణి వింటున్నట్లు వింటూ రవిని చూస్తున్నది.

చెప్పడం ఇక్కడ కాలక్షేపానికై ఏర్పడ్డ ఒక వ్యాపార లక్షణం. వినడంకన్నా చూడటం, చూడటంకన్నా ఏవో ఊహల పిచ్చుక గూళ్ళు నిర్మించుకోవడం ఇదే ఇక్కడి పరమార్థం.

" రవి .... .... .... "

" .... .... .... .. "

" రవీ .... .... .... "

" ఊఁ .... .... .... "

" మొన్న క్రికెట్టు ఎంతబాగా ఆడావనీ- సెంచరీకొట్టగానే పెవిలియన్‌లో నుండి దూకి కౌగలించుకొని అభినందనలు చెపుదామనిపించింది. "

" మరి చెప్పకుండానే లేచి పోయావేం "

" ఏం చేయను ? మామమ్మి డాడీ వెళ్లారు- నేనొక్కతెనూ ఎలావుండను ? "

" మీ డాడీ ఓపెద్ద భూతం-

" అలా అనకు డియర్- ఆయన చాలా మంచివాడు. నేను ఎప్పుడెంతఅడిగినా సరే కాదనకుండా ఎందుకని ప్రశ్నించకుండా పైసలిస్తాడు-"

" పైస లివ్వడంలో తేలదు మంచితనం- పైసలకేం ఈ రోజుల్లో ఎవరైనా ఇస్తారు- ఆ డిస్టిల్డ్ వాటర్ ఇంజక్షన్ల పైసలు మనకేమీ అక్కర్లేదు- నేను నారెక్కల కష్టంతో సంపాదించి మరీ పోషిస్తాను నిన్ను "

" నీ అభిమానానికి థాంక్స్ "

"థ్యాంక్స్ చెప్పగానే సరిపోదు" -

" మరి "

" మీ నాన్నగారిని మన వివాహానికి అంగీకరింప జేయాలి "

రవి ట్రాన్సిష్టరును సన్నగా ట్యూన్ చేశాడు-

ఏదో సినిమాపాట లీలగా హేలగా వస్తున్నది.

" రవీ " పరవశంతో పులకించి పోయింది రాణి.

" రాణీ "

" నాకేదో ఏదో ఔతున్నది "

" అదంతే- ప్రేమలక్షణమే అది "

" రవీ- మానవులకు బుద్ధిలేదు- సంకుచితమైన పద జాలం ప్రదేశం గల ఒక భాషను వ్యవహారంగా తీసు కుంటారు. పక్క ప్రాంతానికి పోతే అది వ్యర్థం- కాని మనం ప్రేమభాషను స్వీకరించాం- దానికి ఎల్లలు లేవు.- కాలాలు లేవు- కులాలు లేవు వర్గాలు లేవు- అనంత విశ్వానికిచెందిన భాష ఇది- హృదయాంతరాంతరాలలో నుండి వినవచ్చే సంగీత శబ్ద చిత్రం ప్రేమ- ప్రేమ- అబ్బ ! రవీ- ఆమాటే ఎంత బాగుందోయ్ "

రాణి కళ్ళు మైకంతో తేలిపోతున్నవి-

ఆమె పమిట చిరుగాలికి రెపరెపలాడుతున్నది.

" నాకు మాత్రం ఏమిటో భయంగావుంది రాణి "

" భయ మేమిటి మనకు- ఎవర్ని చూచి "

" మీ హోమియో డాక్టర్ని చూచి "

" ఎవరు చెప్పారు నీకు మానాన్న హోమియో డాక్టరని- "

" అఫ్‌కోర్సు- అల్లోపతీ, యూనానీ, హోమియో, ఆయుర్వేదం, ప్రకృతి వైద్యం, అన్నీ ప్రయోగిస్తా డనుకో- కాని రాణీ- నీతో పోల్చిచూచినప్పుడు నేను తక్కువ అంతస్థు వాణ్ణి___"

"యూ నాటీబాయ్- ప్రేమకు అంతస్థులు నిర్ణయించడం ఏ యుగంలోనూ జరగలేదు- డబ్బుకేవలం ముడిపదార్థం- మానవుడి భౌతికావసరాలను తీర్చి తీర్చలేని ఒక నిర్జీవ మైన సరుకు. దానికీ ప్రేమకూ సంబంధం ఏమిటి ? అగ్నిలో పోసిన ఆజ్యంలా తాగుతున్న కొద్దీ నిషాను

( జరిగిన కథ )

డా. రాజు దగ్గరికి సమ్మడనే గూడెం మనిషి వచ్చాడు. తనకున్నవి లేనివి రోగాలు చెప్పి పెద్ద మందుల లిస్ట్ రాయించుకెళ్లాడు. సూది మందు అడిగి మరీ వేయించుకొన్నాడు. వాళ్ళ దృష్టిలో ఏ డాక్టరు ఎక్కువ మందులు రాస్తే వాడు పెద్ద డాక్టర్. రాణి డా. రాజు యొక్క కూతురు. ఆమె అడిగినంత డబ్బు ఇస్తుంటాడు. చందా కోసం వచ్చిన అప్పళాచారిని బెదరగొట్టి ఆయనకి లేనిపోని రోగాలు అంటగట్టి ఎఫ్‌త్రీ - ఎఫ్ ఫోర్ ఇంజెక్షన్లు ఇమ్మన్నాడు డా. రాజు శ్యామ్‌తో. డిస్టిల్డ్ వాటర్‌ని వాళ్ళు ఆ సంకేతంతో పిలుస్తారు. ఆ దెబ్బతో అప్పళాచారి చందా అడక్కుండానే ఎదురు కట్టి అక్కడ్నుంచి పారిపోతాడు. అతని చందాల బుక్‌లో డా. మకరంద్ రు. 1116-00 చూసి అతని వివరాలు కనుక్కోమంటాడు డా. రాజు.

( ఇక చదవండి )

పెంచే మద్యంలా హృద్యంగా ఉండే ప్రేమకూ డబ్బుతో నిర్మించే తుచ్ఛమైన అంతస్థుకూ సంబంధం ఏమిటి రవీ "

రవి చిత్తయిపోయాడు " రాణీ ? నీవింత చక్కని కవయిత్రివని నాకు తెలియదు- "

" పోవోయ్ కోతలు- ప్రతిప్రేమికుడూ ఇలాగే అంటాడు "

"కాదు రాణీ-నీమాటలన్నీ సమ్మోహనాక్షరాల్లా,సినిమా పాటల్లా వున్నాయి- నిజం చెప్పు- ఇంతచక్కని కవిత్వం ఎలా నేర్చుకున్నావు- "

రాణి నవ్వింది_ ఆమెకు కొందరు అభిమాన రచయితలు వున్నారు. వాళ్ళ ప్రేమ నవలలలోని వాక్యాలు అలా వల్లె వేసింది.

ఆమెకు కొందరు అభిమాన సినీరచయితలు వున్నారు. వాళ్ళు రచించే ప్రణయ సూక్తులు గుండె నిండా రోజా నింపుకుంటున్నది_ వాటినే అవసరాన్ని బట్టి రవిముందు కొద్ది కొద్దిగా ప్రయోగిస్తున్నది_

" రాజా .... .... .... "

" నాపేరు రవి_ "

" సరేలేవోయ్ నేను రాణినైతే నీవు రాజావి_ రాజా! నాక్కూడా కోరిక వుంది "

" ఏమిటది ? "

" ఏంలేదు_ మనం ఎప్పుడూ ఇలా శాశ్వతంగా ఒకరొకరు చూచుకుంటూ ఉండిపోవాలని "

" భేష్ బాగుంది_ ఇలాదూర దూరంగా ఈ పార్కులో చెట్లలా స్తంభించి పోవాల నేమిటి నీకోరిక_ ఇదేదో ప్లేటోనిక్ లవ్ లా వుందే "

" కాదు రాజా ? నీకర్థం కాదు నా హృదయం. నామనస్సు చాలా డెలికేట్‌గా టెండర్‌గా వున్న జాస్మిన్ ఫ్లవర్. అది డెడికేట్ చేయబడ్డది ఓకే ఒక్క యువ రాజుకు అతడే నా సర్వస్వం_ నా జీవన సౌభాగ్యవిధాత_ నా హార్ట్ ఆఫ్ హార్ట్_ మేరీ దిల్‌కా చోర్. "

" ఓహో_ రాణీ—నీ సమాసాలూ, ఉపమానాలూ చాలా బాగున్నాయి— లే_ ఫస్టుషోకి వేళయింది_ "

" రాజా .... .... .... " లేవడానికి అయిష్టంగా అన్నది_

" ఊఁ .... .... .... "

" ఒకటి చెప్పనా "

" ఏమిటి ? .... .... "

" నేను ఎప్పుడు పిక్చర్ చూస్తున్నా నిన్ను హీరోగా నన్ను హీరోయిన్‌గా భావిస్తూ వుంటాను. ఆ పాటలు ఆ మాటలూ అన్నీ మనకోసమే_ మనసుద్దేశించి వ్రాసినవే ననిపిస్తుంది_ ఏమంటావోయ్_ "

" నిజమే_ "

" అంతేకాదు, ఈ విరబూస్తున్న పుష్పాలు_ వికసించీ వికసించని చుక్కల మల్లెలూ, ప్రణయ రహస్యాలను గుస గుసలుగా విన్పించే గాలి మాతలూ ప్రతిక్షణం నిత్యనూతనంగా నవనవోన్మేషంగా మారే అనంతాకాశమూ_ రాజా! ఈ ప్రకృతి మొత్తం కేవలం నీకోసం నాకోసమే పుట్టింది. ఈ గడ్డి తివాసీమీద ఆకాశపు చాందినీ కింద మనిద్దరం ఇలా నిత్యులమై ఉండిపోవడమే నాకు జీవితానికి ఏకైకాదర్శం_

ఇది పుస్తకంలో మాటలో సినిమా వాక్యాలో రవికి గుర్తుకూడా లేదు. సినిమా ఐతే తెలుగా ? హిందీయా ?

రవి లేచాడు.

రాణి లేచింది.

ఎంటెసీలో ఏదో ఇంగ్లీషు సినిమా నడుస్తున్నది.

" వెళ్దామా ? " రాణి అడిగింది.

" వద్దు డియిర్ మనం వెళ్ళేది, తెరమీద బొమ్మల కోసం కాదు _ కాస్త రిలీఫ్ కోసం_ విశ్రాంతిగా కబుర్లు చెప్పుకోవడం కోసం ".

లిబర్టీ వైపుకు నడిచారు — రాణి రెండు టిక్కెట్లు తీసుకుంది _ ఇరువురూ లోనికివెళ్ళి ఓ మూల సీటు బాగా వెనుక వైపున ఉన్నది చూచుకొని కూర్చున్నారు.

గాంధీగారి సుదీర్ఘమైన ఒక చిత్రంలోని ఒక భాగం ముందు డాక్యుమెంటరీగా ప్రారంభమైంది.

" ఏమిటీ బోరు _ హాయిగా ఎంటెసీకి పోయివుంటే 'రేపింగ్ అండ్ రేపింగ్' పిక్చర్ ట్రైలర్ చూసేవాళ్ళం కదా " విసుగ్గా కూల్‌డ్రింక్స్ కోసం దిక్కులు గాలిస్తూ అన్నది.

రవి నాజుగ్గా రాణి మునివ్రేళ్ళను నొక్కాడు చీకట్లో.

ఆమెకు ఎలక్ట్రిక్ షాక్ కొట్టినట్లయింది.

మెల్లగా తన చేతిని రవి మెడ వెనుకగా చుట్టివేసి సన్నగా గుసగుస చెపుతున్నది.

( స శే షం )

## ప్రశాంతి నిలయంలో (20వ పేజీ తరువాయి)

సమావేశం ఉన్నది, దానికి బాబాగారు తమర్ని రమ్మనమని చెప్పారు. 7 గం. కల్లా గేటువద్దకు వస్తే శ్రీ చిరంజీవిరావుగారు తమర్ని లోపలకు తీసుకొని వెళ్ళతారు అని చెప్పారు. నాకు అటువంటి మహద్భాగ్యం కలిగినందుకు ఎంతో సంతోషించాను. 21 వ తేది ఉదయం ఆ సమావేశంలో పాల్గొనినాను. బాబాగారు సంస్థాగత విషయాలమీద చక్కటి ఉపన్యాసం చేశారు. 21 సాయంత్రం గురుపూర్ణిమ మహోత్సవం పూర్ణచంద్ర ఆడిటోరియంలో బ్రహ్మాండంగా జరిగింది. చోటు సరిపోక వేలాది భక్తులు బయట కూర్చుని నిశ్శబ్దంగా బాబాగారి ఉపన్యాసం విన్నారు. షుమారు 30 వేలమంది ఆ ఉత్సవంలో పాల్గొనినారు. వేదిక ముందు కూర్చొని, వారి ఉపన్యాసం వ్రాసుకొనే మహద్భాగ్యం, నాకు నిర్వాహకులు కలిపించారు. 22 వ తేది ఉదయం మరల భక్తుల వరుసల మధ్యలో కూర్చున్నాను. బాబాగారు వచ్చారు. " కృష్ణమోహన్ ! ఎప్పటివరకు ఉంటావ్ ? " అని బాబాగారు అడిగారు. తమ అనుగ్రహం అన్నాను.

23 వ తేది ఉదయం మరల మామూలుగా భక్తుల వరుసలో కూర్చున్నాను. బాబాగారు వచ్చారు. వెళ్ళిపోతూ దూరంగా నున్న నన్ను రమ్మనమని చేయి ఊపారు. ఆనందంతో బాబాగారి వద్దకు పరుగెత్తాను. " నీ గృహలక్ష్మిని కూడా తీసుకొనిరా ? " అని ఆజ్ఞాపించి బాబాగారు వెళ్ళిపోయారు. నా శ్రీమతి స్త్రీల మధ్యలో ఎక్కడ కూర్చున్నదో, నాకు అంతు పట్టలేదు. వాళ్ళవైపు చూస్తూ చేయి ఊపాను. అదృష్టవశాత్తు నా శ్రీమతి నన్ను చూచి వచ్చింది. ఇద్దరం కలిసి బాబాగారు ఉన్న గదిలోనికి వెళ్ళాం. మాతోపాటు మరికొంతమంది కలకత్తా, వారణాసి, పఠాన్‌కోట, మద్రాసు, వాషింగ్టన్ ( అమెరికా ) లకు చెందిన భక్తులు కూడా బాబాగారి పిలుపుతో అక్కడికి వచ్చారు. మొత్తం ముగ్గురు స్త్రీలు, పురుషులు ఎనిమదిమంది. మా అందరికీ విభూతి సృష్టించి బాబాగారు యిచ్చారు. బాబాగారు భక్తులతో వారి వారి భాషలలో మాట్లాడటం నన్ను మరింత ఆశ్చర్యచకితుడిని చేసింది. సాయిబాబా లాకెట్ వున్న గొలుసును సృష్టించి పఠాన్‌కోట భక్తుని మెళ్ళో బాబాగారే స్వయంగా వేశారు. కలకత్తా అడ్వకేటుకు ఉంగరాన్ని సృష్టించి యిచ్చారు. నా శ్రీమతి వైపు చూచి ఆరోగ్యం ఎట్లాఉన్నది ? అని బాబాగారు అడిగారు. ఆమె నోట మాట రాలేదు. మీకు అభీష్టమైనది యివ్వదలచానని చెప్పి దగ్గరకు మా ఇద్దరినీ రమ్మనమన్నారు. చేయి పైకెత్తారు. చేతిలో ధగధగ మెరిసే నల్లటి "సాలగ్రాం" వచ్చింది. మా కళ్ళను మేమే నమ్మలేకపోతున్నాం. మా చేతుల్లో పెట్టారు. మేము వంగి పాదాభివందనం చేస్తుంటే శాస్త్రోక్తంగా ఆశీర్వచనం చేసి మమ్ము బాబాగారు దీవించారు. మా నోటివెంబడి మాట రాలేదు. ఆనందబాష్పాలు మాత్రం కళ్ళవెంబడి ప్రవహిస్తున్నాయి. తిరిగివచ్చి మా స్థానాలలో కూర్చున్నాం.

మేము కూర్చున్న గది వెనుక మరొక గది ఉన్నది. ఆ గదిలోనికి బాబాగారు వెళ్ళి దంపతులుగా వచ్చినవారిని ఇద్దరినీ, విడిగా వచ్చినవారిని ఒక్కొక్కర్ని లోపలికి పిలిచి ఏదో చెప్పి పంపుతున్నారు. ఆఖరికి మా వంతు వచ్చింది. వెళ్ళాం. బాబాగారు కుర్చీలో కూర్చున్నారు. బాబాగారితో ఇంటర్వ్యూ లభ్యమవుతే ఎన్నో ప్రశ్నలు అడగాలని, నా పుస్తకంలో వ్రాసుకున్నాను. వాటిల్లో అనేక ప్రశ్నలకు వారి ఉపన్యాసాలలోనే సమాధానం నాకు లభ్యమైంది. పుట్టపర్తి విశ్వవిద్యాలయంలో, వాటి అనుబంధ విద్యాసంస్థలలో ఎట్టి రిజర్వేషన్స్‌లేవు. మెరిట్, టాలెంట్ మాత్రమే అక్కడ చూస్తారు. కులంతో గాని, భాషతోగాని ఎట్టి సంబంధం లేదు. భారతదేశంలోని వారే కాదు ప్రపంచంలోని వారెవరైనాసరే, మెరిట్ గలవారికి అక్కడ స్థానం ఉన్నది. ఒకటవ తరగతి నుండి పి. జి. కోర్సులవరకు విద్య ఉచితం. ఏ రకమైన ఫీజులు చెల్లించ నవసరం లేదు. ఇటువంటి ఉచితవిద్య భారతదేశంలో మరి ఏ ఇతర విశ్వవిద్యాలయంలో లేదు. ఉచితంగా, అధునాతనమైన పద్ధతులలో విద్య గరపడంలో పుట్టపర్తి విశ్వవిద్యాలయందే అగ్ర తాంబూలం.

బాబాగారున్న గదిలో ప్రవేశించగానే మా యోగక్షేమాలు అడుగుతూ " నీవు ఎన్నో పనులు చేయాలనుకుంటున్నావు. చేయగలనా ! చేయలేనా ! అని సందేహిస్తున్నావు. ఎందుకు సందేహిస్తావు. నీకు మంచిదని భావించిన ప్రతి పని ధైర్యంగా చేయి. నీ వెనుక నేను వున్నాను. అనవసరంగా ఆలోచిస్తూ నిద్ర కూడా చెడకొట్టుకుంటున్నావు. ఆర్థిక యిబ్బందులు ఉంటే ఉండవచ్చు. నీకు నేను యిప్పుడే తెలుసు. నీవు నా దగ్గరకు రానప్పటి నుంచి నిన్ను నేను గమనిస్తూనే ఉన్నాను. జీవితంలో చాలా నష్టపోయావు. పడిపోయేవాడను నిలబెట్టానుకూడాను మనది శారీరక సంబంధం కాదు. హృదయ సంబంధం. నా దగ్గిరకి నిత్యం ఎన్నో వేల మంది వస్తుంటారు. అందర్నీ నేను పిలుస్తున్నానా ! హృదయ సంబంధం ఉన్నవారే, పూర్వజన్మ సుకృతం

( తరువాయి 52వ పేజీలో )

# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న వాస్తుజ్యోతిష విద్వాన్
కవితా కామేశ్వర శర్మ
అవనిగడ్డ - 521 121

బొమ్మిడి ఈశ్వర వెంకట వరప్రసాద్
అనే వీరభద్రం — జగ్గయ్యపేట

సమా : జాతక ప్రభావం తెలుసుకోవాలంటే అది అంత తేలికగా వ్రాయుటకు వీలైనది కాదు. జ్యోతిషవాణి శీర్షికలో ఆ పని జరిగేది కాదు. పైగా పుట్టినతేది లేనిది ఎవరూ జాతకం చెప్పలేరు. మీ కోరిక తీర్చలేనందుకు Sorry.

ఆర్. చంద్ర — ఖమ్మం

సమా : పేరును బట్టి అందరకూ సమాన ఫలాలు ఉండవు. మీ పేరు ఉన్న వారిలో గొప్పగా వెలుగుతున్న వారుండవచ్చు. జన్మనక్షత్ర - కాల (జాతక)ములు ముఖ్యం. ఒకప్పుడు దానిలో కూడా తేడాలుండును. కవల పిల్లల జాతకాలలో తేడాలుండుట లేదూ. మీకు సామాన్యం. ధనవ్యయం, అశాంతి ఉండును. మీనరాశి మీది.

ఎమ్. రామమోహన్ (వకీలు గుమాస్తా) కర్నూలు

సమా : గవర్నమెంటు ఉద్యోగం వస్తుంది. 1987లో వివాహం కావచ్చు కాని నమ్మకంలేదు. పొలం ప్రస్తుతం అమ్మకుండా ఉండుట మంచిది. భూమి మొత్తం మీద కొంత పోతుంది. ఆంజనేయుని ఆరాధించండి. ఋణ విమోచన అంగారక స్తోత్రం రోజూ పారాయణ చేయండి.

సిహెచ్. సుబ్బారావు (రెడ్డి) — బందరు

సమా : ప్రస్తుతం ఇంకా 1 సం॥రము మీ గ్రహస్థితి యిలాగే ఉంటుంది. మరేమీ భయంలేదు. మానవుడు ఆశాజీవి, 'బ్రతికియున్న సుఖములు బడయవచ్చు'.

మహిళామణి — పెదకళ్ళేపల్లి

సమా : చం + శు Bad అయినా శుక్రునకు నీచభంగం వుంది. అయితే గోచారంలో 8 శని గదా ! శుక్రునకు పాపమధ్యత్వం కూడా Bad. Civil Service కు ప్రయత్నించ వచ్చు. జనరల్‌గా శుక్రుడు యీ లగ్నంకి నీచ మంచిది. (వ్యయం మంచిది) అయితే షష్ఠాష్టమం విద్యకు యింకా అవకాశం ఉన్నది. M. Sc. వస్తుంది.

Advocate, M. A. B. L. — " ........... "

" Present I am starving due to practically zero incomes " అణా సంపాదన లేదు.

సమా : 1987 మంచి భాగ్యంటుందని తోస్తుంది. రాహు దశ. కొంతవరకైనా ఉపయోగిస్తుంది.

రాజేంద్ర — కామారెడ్డి

సమా : లోను వచ్చిన తరువాత ఆ ప్లాటులోనే House నిర్మించండి.

పి. రఘుప్రసాద్ — విజయనగరం

సమా : పై చదువు ఉంటుందని తోచదు. స్నేహితులు మంచివారే. తలితండ్రులకు న్యాయం చేకూర్చగలరు. వ్యాపారమేదైనా చెయ్యండి. దురలవాట్లన్నీ మానండి.

---

**జ్యోతిషవాణి**

పేరు........................................

పూర్తి చిరునామా..................................

........................................

........................................

లేఖ వ్రాయు తేది.....................

టైము పగలు/రాత్రి.....................

జనన తేది..........లేనిచో సుమారు వయస్సు

---

# రంజనిమాల

సంకలనం

డా॥ వి. ఫణీంద్రుడు

వేమన శతకము నుండి తీయబడిన ఈ మాటలు / వాక్యములు : పరమ, ముండేలు, వరద, కురుపతి, జేరచును, నాశబెట్టి, మేలుచేసి, యేలినట్టి, వెలయును, ఖరము పాలు, గన్నియపుడె, దూరము పాఱు, నల్లగనుండు, పురుగు చేరి, మీద నల్లగ, రాజిలచేసి, వసుధలోన, దరువు దరవ, మేడిపండు చూడ, వెలయువనము, దగదెట్టి కార్యంబు, దెలిసినట్టివారి, దళుకు బెళుకు రాళ్ళు, పెట్టి పోయలేని వట్టి, ముణికి వాగు పాఱు మ్రోత, పంది బురద మెచ్చు బన్నీరు మెచ్చునా; ఈ దిగువ ఆధారములతో అమర్చి రంజనిమాలను పూరించండి.

## ఆ ధా ర ము లు

### అ డ్డ ము

1. " నీల మొక్కటి చాలు — తట్టెడేల "
4. " — లోన మలయజంబున్నట్లు "
7. " — లోభులైన పాపులకును "
8. " వేఱు పురుగు చేరి వృక్షంబు — "
9. " పొసగ — పొమ్మనుటే చాలు "
10. " — కరవు రెండు వరసలో నెరుగుడి
14. " గలుగు సాధు జనుల — "
15. " నీళ్ళలోన మీను నిగిడి — "
16. " — నరుల భూమి "
18. " ఉసురు తప్పకంటు — దెబ్బగా "
21. " — విశ్వదాభిరామ వినురవేమ "
23. " మిరపగింజ చూడు మీద — "
24. " — దేహంబులందును "

### ని లు వు

1. " — బుట్టు దధి ఘృతంబు "
2. " — జనియించి కులము జెరిచె "
3. " మాటలాడనేర్చి మనసు — "
4. " కులము లేనివాడి కలిమిచే — "
5. " — జాల వార్తకెక్కు "
6. గంగ పారునెపుడు కదలని గతితోడ — తోడ"
11. " తామసించి చేయ — "
12. " లక్ష్మి — లంకాధిపతి పురి "
13. " కడవిడైన నేల — "
17. " — మేలిమై యుండును "
19. " మృగమదంబు చూడ — నుండు "
20. " చీడ — చెట్టు జెఱుచు "
22. " మొదట — తుదిలేదు పొమ్మన "

( 49వ పేజీ తరువాయి )

గలవారే నా సన్నిధికి రాగలుగుతున్నారు, అటువంటిది మన సంబంధం. నీకు ఇంటి వ్యవహారాలకన్నా బయట వ్యవహారాలు ఎక్కువ. ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారుగదా ! బయట వ్యవహారంతోపాటు ఇంటిని గురించి కూడా కొంచెం ఆలోచించు. ఈ మధ్య నీ మనసులో కొంచెం బలహీనత చోటు చేసుకుంటున్నదేమో ననిపిస్తున్నది. ధైర్యంగా ముందుకు నడువు. నీవెంట నేను ఉన్నాను. అధైర్యపడకు. " అంటూ నా చేతులు తీసుకొని వారి తొడమీద పెట్టి నా చేతులమీద వారి చేతులు పెట్టారు. నా కళ్ళవెంబడి ఆనందభాష్పాలు రాలుతున్నాయి. తన్మయత్వంలో " నేను రాజకీయాలలో చాలా దూరం పయనించాను " అని మాత్రం అనగలిగాను. "నాకు సర్వం తెలుసు. ప్రజలు నిన్ను మోసంచేశారు. అయిన వాళ్ళు మోసం చేశారు.. స్నేహితులనబడే వారుకూడా అన్యాయం చేశారు. నీవు చాలా కష్టాలుపడ్డావు. అన్నీ నాకు తెలుసు. నీవు యిప్పుడు యింకా భయపడవసరం లేదు. నేను నీ వెంట ఉన్నాను. ఇది నీ స్వంత ఇల్లు ఎప్పుడు రాదలచుకుంటే అప్పుడు రావచ్చు ధైర్యంగా మంచి పనులు చేయి. నీవు సాధించాలనుకున్నవన్నీ సాధించ గలుగుతావు" అంటూ నా పిల్లల చదువువిషయం అడిగారు. అన్నీ చెప్పాను " పెద్దవాడు నాన్న మాట వింటాడుగాని, అమ్మ మాట లెక్కచేయడు సహవాస దోషాలున్నాయి. వాడు ఎం. బి. ఏ. నాదగ్గిర చదవాలి. ఈ తడవ తప్పకుండా పిల్లల్ని నా దగ్గిరికి తీసుకొనిరా ! వాళ్ళకు నేను చెబుతాను " అని బాబాగారుచెప్పారు.

బాబాగారు నా భార్య వైపు చూచి, మేము ఏమీ చెప్పకుండానే, నా భార్య జబ్బులన్నీ ఒక అనుభవంగల డాక్టర్ చెప్పినట్లుగా చెప్పివేశారు. " ఇక్కడికి రాలేని స్థితిలో నీవు వచ్చావు. నీ భక్తి నాకు తెలుసు భయపడకు. అన్ని జబ్బులు నయమవుతాయి. నేను యిచ్చిన సాలగ్రామును నిత్యమూ అభిషేకం చేసి తీర్థం తీసుకోండి. స్వస్థత చేకూరుతుంది. దానిలో మహత్తరమైన శక్తి ఉన్నది. ఆర్థిక యిబ్బందులవలన, అనారోగ్యం వలన ఈ మధ్య కొంచెం చికాకు పడుతున్నావు. చింత ఎందుకు బాబా మీ ప్రక్కనే ఉన్నాడు. ఆరోగ్యం చేకూరుతుంది. ఆశించిన పనులన్నీ నెరవేరుతాయి. నీవు చాలా త్యాగం చేశావు. నీవు అన్నీ పోగొట్టుకున్నావు. " అంటూ చేతులు, మెడ చూపించారు, ఆమె బంగారు వస్తువులను అమ్మివేసినట్లుగ. ఆ సమయంలో మా మనసుల్లో కూడా ఆ విషయంలేదు, అయినప్పటికీ బాబాగారు వెలిబుచ్చిన ఆ నగ్నసత్యానికి మేమెంతో ఆశ్చర్యపడ్డాం. పొంగి పొరలి వచ్చే ఆనంద భాష్పాలతో బాబాగారి వద్ద శలవు తీసుకొని బయటకు వచ్చాము.

బయటకు వచ్చిన తరువాత " కృష్ణమోహనరావ్ ! ఎప్పుడు వెళ్ళతావు ? " అని బాబాగారు అడిగారు. "తమ అనుజ్ఞ". అన్నాను " ఛీ ! అందరూ అంటున్నట్లు అంటున్నావేం. మనది హృదయ సంబంధం " అన్నారు బాబాగారు. రేపు ఉదయం వెళ్ళతానని చెప్పాను. ఆరోజు రాత్రి అక్కడే ఉన్నాం. మమ్ములను ఆశ్చర్యంలో ముంచివేసే విషయం జరిగింది. తెల్లవారేటప్పటికే నా భార్య నొప్పులన్నీ తగ్గాయి, వాపులు తీసాయి. మామూలు మనిషి అయింది. ఎన్నో సంవత్సరాలనుంచి బాధ పడుతున్న నా శ్రీమతికి ఆరోగ్యం చేకూరింది. డా॥ అశ్వనీ కుమార్, డా॥ ఉప్పులూరి మాధవరావుగారలు ఎన్నో మందులు యిచ్చారు. నయంకావడం కష్టమని. డా॥ అశ్వనీ కుమార్ చెప్పారు కూడాను. అటువంటి స్థితిలో నా శ్రీమతికి ఆరోగ్యం చేకూరడం విశేషమేకదా ! బాబాగారి మహిమలు పుస్తకాలలో చదివాను. కాని నేడు అనుభవిస్తున్నాను, అనుభూతిని పొందుతున్నాను. నా సుదీర్ఘ రాజకీయ జీవితంలో చాలా అనుభవాన్ని గడించాను. ఎంతోమంది పెద్దలను కలిశాను. కాని బాబాగారిలాంటి మహనీయుడ్ని కలిసే మహద్భాగ్యం యిప్పుడే నాకు లభించింది. వారి మహిమాన్వితశక్తి ఎంతటిదో నేను యిప్పుడు అనుభవిస్తున్నాను, చూస్తున్నాను. బాబాగారు నిజంగా మాపాలిటి మానవ రూపంలో కనిపించిన ఆ సాక్షాత్ భగవంతుడేనని నా సంపూర్ణ విశ్వాసం.

ఆఖరులో మేము గదినుండి బయటకు వస్తుంటే " నాకు ప్రచారాలమీద నమ్మకంలేదు, ఇష్టంలేదు, అవసరం లేదు. " అని బాబాగారు అన్నారు. అయితే వారి అభీష్టానికి విరుద్ధంగా నా అనుభవాన్ని రాస్తున్నందుకు మన్నిస్తారని, క్షమించాలని వారిని మనఃపూర్వకంగా వేడుకుంటున్నాను, అర్థిస్తున్నాను. ఎందువలనంటే, ఎన్నో సంవత్సరాలనుంచి ఎన్ని మందులు యిప్పించినా నయం కానటువంటి సుదీర్ఘవ్యాధి నయం కావడం ఎవరికైనాసరే పట్టరాని సంతోషాన్ని ఆనందాన్ని సహజంగా కలిగిస్తుంది. ఈ అనుభవాన్ని మనసులో దాచుకోలేక బహిర్గతం చేస్తున్నాను. బాబాగారు కూడా సహృదయంతో నన్ను మన్నిస్తారని విశ్వసిస్తున్నాను. నా ఆవేదనను అర్థం చేసుకుంటారని భావిస్తున్నాను. నా శేష జీవితమంతా ధర్మ మార్గంలోనే నడవడానికి అవసరమైన శక్తి సామర్థ్యాలను నాకు బాబాగారు ప్రసాదించాలని వారిని మనఃపూర్వకంగా వేడుకుంటున్నాను. ఓం సాయిరాం ! ★